నగ్నసత్యానికి విశ్వరూపానికి జరిగే నిత్య సంఘర్షణకు నిజమైన రూపకల్పన



ఆదర్శ చిత్ర

# మా ఇద్దరి కథ

ఈస్ట్‌మన్ కలర్

నిర్మాతలు
**కె. రంజిత్‌కుమార్, కె. గోపాలకృష్ణ**

దర్శకత్వం
**నందమూరి రమేష్**

ఆంధ్రశ్రీ ఫిలింస్, సీడెడ్ జయలక్ష్మి పిక్చర్స్,

## లోకంపోకడ




అక్రమంగా సంపదకూడబెట్టిన అభ్యర్థులను అనుమతించబోమని జనరల్ జియా బెదిరిస్తున్నారు! అంటే మనమంతా లాభం లేనట్టే నన్నమాట

భుట్టో

పాకిస్తాన్ పీపుల్స్ పార్టీ

సంక్షోభావస్థలో పడ్డ భుట్టో పార్టీ

రాష్ట్రపతి విమానంలో అమెరికా వెళ్లారు... మరెందరో వెళ్తున్నారు మరి— నేనెందుకు వెళ్లకూడదు!

నేను అధికారంలో వుంటే మొరార్జీ జైలునుంచి ప్రాణాలతో బయట పడేవారు కాదు!

బన్సీలాల్

నిన్న

నేడు

మొరార్జీభాయ్! నన్ను కాపాడండి బాబోయ్!

బన్సీలాల్


## ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
[1938–1972]

శుక్రవారం : 23–9–'77
పింగళనామ సం భాద్రపద శుద్ధ ఏకాదశి
సంపుటము 71 సంచిక 1

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

★

పోస్టులో ఏడాది చందా రు. 41–60
ఆరు మాసాల చందా రు. 20–80
విడిప్రతి వెల 75 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ–520 003


## విషయానుక్రమణిక

అట్టమీది బొమ్మ
వినాయకుడు
(చిత్రకారుడు : వేజెండ్ల సత్యనారాయణరావు)
[ప్రత్యేకవ్యాసం, పాటలకు 26–27 పేజిలు చూడండి]

# గొంతునొప్పా? దగ్గా?



## గ్లాక్సోవారి

# డెక్వాడిన్

## మాత్రమే రెండు విధాలుగా పనిచేస్తుంది

రెండు విధాలుగా పనిచేసే డెక్వాడిన గొంతునొప్పికి
సంబంధించిన అంటువ్యాధిని ఎదుర్కొంటూ,
నొప్పినుండి ఉపశమనం యిస్తుంది.
గొంతునొప్పికి సంబంధించిన అంటు వ్యాధులను ఎదుర్కొంటూ
గొంతునొప్పి బాధను కూడా నివారించే లోజెంజ్ డెక్వాడిన్ మాత్రమే
అందుకు కారణం దీనిలోగల డెక్వాలినియమ్ క్లోరైడ్.
ఇది గ్లాక్సోవారి అంతర్జాతీయ పరిశోధన ద్వారా రూపొందింపబడి,
శక్తివంతమైన యాంటిసెప్టిక్ మరియు బాధానివారిణిగా వైద్యవృత్తి
చేసే వారిచే ఆమోదింపబడింది.

డెక్వాడిన్ వేసుకున్న మరుక్షణమే, డెక్వాలినియమ్ క్లోరైడ్ పని
చేయుటం ప్రారంభించి, మీ గొంతునొప్పికి సంబంధించిన అంటు
వ్యాధిని ఎదుర్కొనడమే గాక, నొప్పినుండి ఉపశమనాన్ని కూడా
యిస్తుంది. గొంతుకోసం వాడే ఏ యితర లోజెంజ్ కూడా ఇంత
త్వరితంగా, నిలిచే ఉపశమనాన్ని యివ్వదు

డెక్వాడిన్—గొంతునొప్పి, దగ్గులకు గ్లాక్సోవారి చికిత్స

GLD-8783



# ఉత్తరాలు



## పాలవాసన?

వాణిశ్రీ ముఖచిత్రం పాలవాసన కొడ్తోంది సుమండీ. ఎంత నాచురల్‌గా ఉందో!

కోమలేశ్వరి. కె. (గురజాల)

## ముచ్చట

2.9.77 నాటి పత్రికా ముఖ చిత్రం 'అనుగ్రహం'లో అనసూయ (అగ్రనటి) ముచ్చటగా ఉంది.

మానవుడు ఆశావాది. ఆశకు అంతులేదు. ఆశలు లేని వాడు మహాత్ముడే అవుతాడు. ఆశలున్నప్పుడు కోరికలు తప్పవు. కలలూ తప్పవు. కాని కల్పన కథలో కల్పన మరెప్పుడు కలలు కనలేదు అంటే ఆశ్చర్యంగా ఉంది. ఊమెన్ గారి లోకంపోకడ కార్టూన్లు పత్రికకే హైలైట్‌గా ఉంటున్నాయి.

డి. ఉదయకుమార్, (కుర్ధారోడ్ – ఒరిస్సా)

* * *

మా అభిమాన నటి కుమారి వాణిశ్రీ ముఖ చిత్రం ఎంతో బాగుంది. ముఖచిత్రం విషయంలో మీరు తీసుకుంటున్న శ్రద్ధకు ఎంతో కృతజ్ఞులము.

అవ్వారి రామప్రసాద్ (విజయవాడ)

## మాయాజాలం

26—8—77 వ తేదీ వెలువడ్డ పత్రిక, ప్రభ ముఖచిత్రం మువ్వన్నెలతో ఆకర్షించింది మాయాజాలం మతి కట్టువంటి ఉత్సాహం గొలిపే శీర్షికలను ప్రచురిస్తున్నందుకు మా ధన్యవాదాలు

ఎ. బి. ప్రసాద్, కె. అశోక్, (నంద్యాల)

## ఫాలాక్షుని డైరీ

26.8.77 సంచికలోని ఫాలాక్షుని డైరీ చదివాను. మొదటిది ఇందిరాగాంధీని భుట్టోని, కరుణానిధినీ, బండార్‌నాయకేను ప్రజలు మార్చి పది కొత్తవారిని చూడాలనే ఆసక్తి వల్ల కాదు. కనీసం కరుణానిధి తప్ప (అతని గురించి నాకు బాగా తెలియదు) మిగతా ముగ్గురు నీచాతి నీచులు.— దీనికి మీ సమ్మతి అవసరం. దేశం ఏమీ డ్రాయింగు రూము కాదు. ప్రతిరోజు అలంకరణలు మారుస్తూ ఉండటానికి 30 ఏళ్ళు మా నాయకులు ప్రభుత్వాన్ని తోసి పారేయటానికి లక్షలు కన్నీళ్లు ధార పోశారు. వేల ప్రాణాలు అర్పించారు.

రెండవది. కుల్‌దీప్ నాయరు అలా వ్రాశాడట అని వారు వ్రాశారు. పుస్తకం కొని చదివి దాని తరువాత వ్రాసి ఉంటే బాగుండేది. వారు వ్రాసిన దానిలో సగం నిజం సగం అబద్ధం అంటే సంజయ్ తల్లిని కొట్టగా చూసిన వాళ్ళు చెప్పారని వ్రాసిన మాట నిజం. ప్రతి విషయంలోనూ ఇలాగే కొట్టేవాడని వ్రాశాడని వారు కల్పించిన సంగతి పచ్చి అబద్ధం.

వి. దుర్గాప్రసాద్ (న్యూఢిల్లీ)

* * *

శాంతితీరం సీరియల్ ఆదిలోనే చాలా చక్కగా ప్రతి ఘటనా కళ్ళకు కట్టినట్లు కనిపిస్తోంది. పాపం! మాధవి జీవితం శాంతితీరం చేరు అని తెలిసినా ఎ చేరుకు ఇంకా అన్న ఆతృత ఉంది.

గురువెళ్ళి గోవిందరావు, [ఖర్గపూర్]

## ఎడ్రసు దొరకలేదు

నేను ఇంది మొదటిసారి మీ (నా) పత్రిక అడ్రసు చూసాను వ్రాసేది కూడ మొదటిసారి నేను ఎన్నిసార్లు మీకు ఉత్తరము వ్రాయాలనుకున్న అడ్రసు ఎక్కడ దొరికేదికాదు. 2—9—77 వ పత్రికలో వున్న అడ్రసుచూసి మీకు వ్రాస్తున్నాను.

2—9—77 వ తేదీగల పత్రికలో వున్న రగతి పండరీ రచించిన (బళ్ళు తెరిచారుబాబోయ్) కార్టూన్‌లు చాలా బాగున్నాయి. ఫాలాక్షుని డైరీ కూడ బాగుంది కథలు కల్పన, గూటిలో గువ్వలు చాలా బాగున్నాయి.

యస్. యమ్. భాషా (కర్నూలు)

## ఉత్తరాలు

2—9—77 వ తేదీ పత్రికలో ప్రచురించబడిన (వి. మన్మథస్వామి, ఎస్. రమేష్ బాబు, బరంపురం) గార్ల లేఖలో 22—7—77 వ తేదీన వెలువడిన పత్రిక ముఖచిత్రం ఆకర్షించి, ఆనందాన్నిచ్చింది ప్రచురించిన కథలు బాగుంటున్నవి అని వ్రాస్తిరి. తప్పులెన్నువారు తన తప్పులెరుగరు అన్నట్లు వారు కూడా ఆ కథలు ఏ విషయంలో బాగున్నవో వ్రాయలేదు ముఖచిత్రం బాగుంది కథలు బాగున్నాయి లేదా బాగులేదని వెల్లడించిన పాఠకుల అభిప్రాయాలవలన వీరికి కలిగిన బాధ ఏమిటో మాకు అర్థం కావటంలేదు

చిన్నతంబి, శంకర్‌రెడ్డి, (ఇచ్ఛాపురం)

# మ న లో మా ట

**అందరికీ యెంతో యిష్టమైన పండుగ వినాయక చవితి  అది ఆంధ్రసచిత్ర వారపత్రికకు యింకా ప్రియమయిన పండుగ. వినాయక చతుర్థి ఆంధ్రసచిత్ర వారపత్రిక పుట్టినరోజు పండుగ అని మా ప్రియతమ పాఠకులందరికీ తెలుసు.**

ఈ సంచికతో ఆంధ్రసచిత్ర వారపత్రిక తెనుగువారి సేవలో ఆరున్నొక్క దశాబ్దాలు విజయవంతంగా పూర్తిచేసి – ఎనిమిదవ దశాబ్దం మొదటి సంచికలో అడుగిడుతున్నది !

ఈ శుభ సమయంలో పాఠకులకు, ఏజెంట్‌లకు, రచయితలకు, ప్రకటనకర్తలకు అందరికీ మా ప్రత్యేక శుభాకాంక్షలు.

* * *

ఈ వారంనుంచి ప్రారంభమైన సీరియల్ కథ 'రాగబంధం' [పేజీలు 28-9] రచయిత్రి శ్రీమతి యార్లగడ్డ సరోజినీదేవి మా పాఠకులకు 'బాంధవ్యాలు' సీరియల్‌ద్వారా [18-6-'76 సంచిక మనలోమాట] సుపరిచితులే! 'బాంధవ్యాలు' వలెనే యీ రాగబంధం కూడా ఆదరణ పొందగలదని అనుకుంటున్నాము.

* * *

ఈ సంచిక "సినీమా శీర్షిక" అంతా సుప్రసిద్ధ హాస్యనటులే – వారి వారి వ్యాఖ్యానాలతో ముచ్చట్లతో ఆక్రమించుకున్నారు... ఇది న్యాయంకు డా ను... ఈ సంచిక కార్టూనిస్ట్‌లకు', 'హాస్య నటులకు' యెప్పటివలె ఒక ప్రత్యేక వేదికగా అమరిందని వేరే చెప్పనక్కరలేదనుకుంటాము!

* * *

26-27 పేజీలలో గణపతి పూజలు మనదేశంలో ఎంతకాలంగా "ప్రాచుర్యం"లో వున్నాయో తెలియజేసే "సచిత్ర వ్యాసం" వున్నది. ఇది చరిత్రమీద ఆసక్తి వున్న వారికి మరింత నచ్చుతుందని అనుకుంటున్నాము.

* * *

ప్రత్యేక సంచికలో కొన్ని మామూలు శీర్షికలు పడకపోడం – అవి యెప్పటివలె పైవారంనుంచి కనపడటం జరుగుతూ వుండేదే కనుక...

---

## 'గూటిలోని గువ్వలు'

2—9—77 వ తేది వాణిశ్రీ ముఖచిత్రంతో వెలువడిన (మీ) మా అందాల అభిమాన చిత్రవార పత్రిక చాలా ఆకర్షణీయంగా ఉన్నది రని కుంకమబొట్టుతో, మెళ్లో నల్లపూసల ...డలో, నల్లని శరీరచ్ఛాయతో అచ్చంపల్లెపడుచులా సింగారించుకున్న కుమారి వాణిశ్రీ ముఖచిత్రం చూసిన తరువాయి: (మీ) మా పత్రికకు ఉత్తరము వ్రాయాలనిపించింది. ముఖ్యంగా ...టిలోని గువ్వలు కథ మా అందరిని ఆకర్షించింది. కథా వస్తువు చాలా చక్కగా రచించిన ...మ్మసెట్టి రామారావుగారికి (మీ) మా పత్రిక ద్వారా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాము. రాగతి ...డరి బళ్లు తెరిచారు బాబోయ్ మీద జోకు ...కు చాలా నవ్వు తెప్పించాయి. అందుకే ...) మా పత్రికను మన స్ఫూర్తిగా మేము ...ము అభినందించుచున్నాము.

సి. హెచ్. రామారావు, వై. సత్యారావు,
డి. అప్పల నారాయణ (గజపతి నగరం,)

## వి మ ర్శ లు

2.9.77 నాటి పత్రికలో బరంపురం ...కుల వ్రాసిన ఉత్తరం చదివి నేనీ ఉత్తరం ...రాయవలసి వచ్చింది. చాలా మంది పాఠకులు కథ బాగుంది, ఈ కథ బాగాలేదు ? అని ...స్తున్నారని వీరు విమర్శ చేశారు. మనం చెప్పేవాటిని ముందుగా మనం ఆచరిస్తున్నామో లేదో చూసుకోవాలి. ఆ నాటి ఉత్తరంలో మాకు ఈ సంచికలోని కథలన్నీ బాగున్నాయి. అని వ్రాశారు. అని ఎందువలన బాగున్నాయో వారే వ్రాయక పోవడం శోచనీయం. మనం పాటించని శ్రీరంగ నీతులు చెప్పడం ఎందుకు?

మరొక విషయం వారికి మనవి చేసేదేమిటంటే మా అభిమాన ఆంధ్రపత్రికలో ఉత్తరాలు శీర్షికలో యిప్పటికి ఎక్కువగా విమర్శలతో ఉన్న లేఖలకే ప్రాధాన్యం యిస్తూ ఉన్నారు. వారు ఈ విషయం గమనించగలరు.

ఆర్వేటి జగదీష్‌గుప్త. (కర్నూలు



## తాజా కాలమ్

భివానీలో అగస్టు 23 న యూత్ కాంగ్రెసు ఫండ్ కుంభకోణం కేసులో అరెస్టు అయిన మాజీ హర్యానా ముఖ్యమంత్రి శ్రీ బన్సీలాల్ — అగస్టు 30 న ప్రధాని మొరార్జీ దేశాయికి ఒక ఫిర్యాదు లేఖ రాస్తూ "ప్రస్తుత హర్యానాముఖ్యమంత్రి కక్షతో, తనను అరెస్టు చేశాకా తన మెడలో చెప్పుల దండ వెయ్యమన్నాడని" ఆరోపిస్తూ ఫిర్యాదు చేశాడు ... "అంతేకాదు నేను ఎక్కడ వుంటే అక్కడ కరెంటు సప్లయి లేకుండా చేశాడు" అని కూడా శ్రీ దేవీలాల్ మీద బన్సీలాల్ గారు ఫిర్యాదు చేశాడు ... "వీలైతే నాకు మిమ్మల్ని కలుసుకునే అవకాశం యిప్పించండి" అని కూడా శ్రీ బన్సీలాల్ కోరాడు ... అలాగే ఆయనని సెప్టెంబర్ 1న ఒక అరగంట కల్సుకున్నాడు కూడా.

### నాకు చెప్పుల దండ వెయ్యమన్నాడు దేవీలాల్ - బన్సీలాల్ ఫిర్యాదు



ఆరోగ్యామాత్య నారాయణ్

### 'హిందీలోనే పిటిషన్లు"

రాజ్‌నారాయణ్ గారు ఆరోగ్యమంత్రి అయిన తర్వాత — హిందీ భాషమీద చేసే ప్రసంగాలన్నీ ఒకఎత్తు—వారు నా దగ్గిరకు వచ్చే "పిటిషన్‌లు అన్నీ హిందీలో వుంటే నేను పరిశీలిస్తా"ను అంటూ చేసిన ప్రకటన ఒక ఎత్తూను ... శ్రీమతి గాంధీ మీద ద్వేషం—హిందీ మీద మోజు యీ రెండు కూడా యీ 'రేబరెల్లీ' వీరునికి ఎక్కువగా వుండటం చేతనే దేశంలో శ్రీమతి గాంధీ పట్ల సానుభూతి, — హిందీ మీద ద్వేషం ఎక్కువ మందికి పెరుగుతున్నాయి అని కొందరి వూహ...ప్రస్తుతం శ్రీ రాజ్‌నారాయణ్ ఇంగ్లాండ్, నార్వే, స్విజ్జర్‌లాండ్‌లలో పర్యటిస్తున్నాడు.

### "విదేశయానానుమతి పత్రంకోసం శ్రీమతి ఇందిరా గాంధీ దరఖాస్తు !"

మాజీ ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరా గాంధీ కొంతకాలం క్రితం — విదేశయానం కోసం "ప్యాస్‌పోర్టు యిప్పించమని జనతా గవర్నమెంటుకి అప్లికేషను పెట్టుకున్నారట! ఆమెకు లోగడవున్న దౌత్య హోదా విదేశయానానుమతి పత్రం మార్చి 21 తో అంతమైపోయింది! అయితే ప్రస్తుత పరిస్థితులలో ఆమెకి జనతావారు ప్యాస్‌పోర్టు యివ్వక పోవచ్చునని మొరార్జీ గారు ప్రకటించాడు.



విదేశాలలోని చాలాసంస్థలు తనను 'ఉపన్యాసాలు' చేయడానికి రమ్మని ఆహ్వానించాయని శ్రీమతి ఇందిరాగాంధీ యిటీవల వెల్లడి చేశారు. బి. బి. సి. కి యిచ్చిన యింటర్వ్యూలో కూడా ఆమె యీ విషయం ప్రస్తావించారు "ఐతే నాకు వీళ్ళు ( జనతా ) ప్యాస్‌పోర్ట్ యిస్తారా ? అన్నది అనుమానమే" నన్నదామె ...

### నీలం సంజీవరెడ్డి గారి వూపిరితిత్తుల్లో మచ్చ !

ఐదువారాల క్రితం రాష్ట్రపతిగా పదవీ ప్రమాణం చేసిన అరవైనాలుగు సంవత్సరాల రాజకీయ దురంధరుడు నీలం సంజీవరెడ్డిగారి వూపిరితిత్తుల్లో నల్లని నాణెమంత మచ్చ ఏర్పడ్డది. దీన్ని ( అగస్టు 30 ) పరీక్ష చేసిన ప్రత్యేక వైద్యుల నిపుణుల బృందం—యిది టి. బి. వ్యాధికో — పుట్టకురుపు వ్యాధికో దారి





తీయక ముందే చికిత్స అవసరం అన్నారు. అందుకని సెప్టెంబర్ 4 న శ్రీ సంజీవ రెడ్డి—మామూలు విమాన సర్వీసు వారి — విమానంలో అమెరికా ప్రయాణమై వెళ్ళారు ... న్యూయార్క్ నగరంలోని "స్లోన్ కెట్టెరింగ్" వైద్య సంస్థలో ఆయనను పరీక్షించి చికిత్స చేస్తారు. కేంద్ర మంత్రివర్గం వెంటనే సమావేశమై రాష్ట్రపతి చికిత్సకు అన్ని యేర్పాట్లు చెయ్యాలన్న నిర్ణయం తీసుకుంది! అధికార హోదాలో విదేశ కార్యక్రమమేదీ తలపెట్టకుండానే యిట్లా చికిత్సకోసం—'గోడా'నికి అవతలి తట్టుకు వెళ్ళారేఅన్న విచారం తప్ప—మామూలు ప్రజానీకం అంతా కూడా — నీలంవారి ఆరోగ్యాన్నే ఆకాంక్షించుతున్నారు !

ఇప్పుడుంటున్న "మందిరం నుంచి అట్నుంచి వచ్చాక (అక్టోబర్ 5 న) నైనా మారిపోతాను" — అదే ఆవరణలో వున్న చిన్న బంగళా దేనిలోనైనా నిరాడంబరంగా వుంటాను" అని సంజీవరెడ్డిగారు ప్రకటించారు — ఈ మధ్యనే రాష్ట్రపతిగా సంజీవరెడ్డిగారు తిరుపతికు వెళ్ళి (ఫొటో చూడండి) 'స్వామి'కి మొక్కు చెల్లించుకున్నారు. లోగడ అత్యంత క్లిష్ట సమయంలో కార్యవాహక రాష్ట్రపతిగా వున్న శ్రీ బసప్ప దానప్ప జెట్టి తిరిగి యీ బాధ్యతని స్వీకరించారు. [ రాజీ ]



# భయం

సత్యం మందపాటి

గురూగారూ—ఇంతకీ సినిమా వున్నట్టా — లేనట్టా యివాళ అడిగాడు లీలా ప్రసాద్, రామకృష్ణ రావటం చూసి.

"మన తెలుగు సాంస్కృతిక సంఘం కార్యదర్శిగారిచ్చిన 'ఆహ్వానం' ప్రకారం యివాళ ప్రొద్దున పది గంటలకు ఈ హాల్లో సినిమా వుండాలి మరి—కానీ ఎవరూ యింకా వచ్చినట్టులేదే" రామకృష్ణ అన్నాడు అటూ — యిటూ చూస్తూ.

ఈలోగా ఒక కారు వచ్చి ఆగింది. దాంట్లోంచి అయిదుగురు అందమైన అమ్మాయిలూ, ఒక అబ్బాయీ దిగారు.

"ఈ కేరళదేశంలో తెలుగుసినిమా వేస్తున్నామని తెలిసి, మళయాళ మనోరమలు చూట్టానికి వచ్చినట్టున్నారు గురూగారూ!" అన్నాడు లీలాప్రసాద్ — సన్నగా విజిల్‌వేసి.

"ఐ డోంట్ థింక్‌సో" సాలోచనగా అన్నాడు రామకృష్ణ, అయిదుగురు అమ్మాయిలకూవున్న పొడగాటి ఏడు జడలను చూస్తూ.

ఈలోగా ఆ అయిదుగురప్సరసల తాలూకు అబ్బాయి, కౌంటర్‌లో అడుగుతున్నాడు. హాలువాడు "'మనసారుమయిల్' మళయాళ సినిమా చూడాలంటే మధ్యాహ్నం రెండున్నరకి రండి, ఈలోగా 'తెలుగు' సినిమా చూడాలంటే చూడవచ్చు" అని చెప్పినట్టున్నాడు — ఆ అబ్బాయి వెనక్కి తిరిగి సదరు అయిదుగురు అమ్మాయిలనూ కారులో ఎక్కించుకుని యింకో మళయాళ సినిమాకోసం 'అజంతా' థియేటర్‌కో, 'కస్తూరి' థియేటర్‌కో బయల్దేరాడు.

ఆ కారు అటు వెళ్ళగానే యింకో

కాయ లోపలకు వచ్చింది. సుబ్బారావ్, అనుపను దిగారు దాంట్లోంచి

"వాట్! ప్రసాద్ సినిమా వున్నదా ?" అడిగాడు సుబ్బారావ్.

"వున్నట్టే వుంది" అన్నాడు లీలా ప్రసాద్.

లోపలకు వెళ్లి కనుక్కొచ్చినట్టున్నాడు రామకృష్ణ "బాక్స్‌వచ్చిందని అప్పుకుట్టన్ నాయర్ చెప్పాడు ఇంకేమీ ఫరవాలేదు ఇవాళ తెలుగు సినిమా చూడబోతున్నాం" అన్నాడు

"పదయిపోయింది అప్పుడే, యింకా అందరూ రాలేదే!" అన్నది అనుపమా సుబ్బారావ్

"అదే తెలుగువాడి గొప్పదనం. పది గంటలకు సినిమా అంటే పదిన్నరకల్లా టంచనుగా వచ్చేస్తారు!"

హాల్లో పాటలు మొదలు పెట్టినట్టున్నారు— "నావరు కావ్యదేవతే..." అని కమ్మగా పాడుతున్నాడు జేసుదాసు.

మెల్ల మెల్లగా తెలుగు మిత్రులు చేరుతున్నారు

"తెలుగు సినిమా చూసి దాదాపు మూ డే ళ్లు యి ం ది!" అన్నాడు మూర్తి అప్పుడే వస్తూ.

"అదృష్టవంతుడివి— బ్రతికిపోయావ్" అన్నాడు సుబ్బారావ్.

"ఏం బాబూ— ప్రతినెలా మన సంఘం వాళ్లు చూపించే సినిమాలకు రావటంలేదా— తెలుగు సినిమా చూసి మూడేళ్లయిందంటున్నావ్" అడిగాడు లీలాప్రసాద్.

"ఎప్పుడూ ఏదో ఆఫీసు పని తగిలి రావటం కుదరటంలేదు— ఏం చేయను!" అన్నాడు మూర్తి.

"కొయ్యకురా కృష్ణన్‌కుట్టీ— మేము యిక్కడ తెలుగు సినిమాలు వేసే టైము లోనే— నువ్వు మళయాళ సినిమాలకుపోయి



దంతవైద్యుడు

బాపు

నట్టు దాఖలాలు వున్నాయి— నిరూపించమంటావా?" అన్నాడు చిదంబరం

"నిరూపించనక్కరలేదు యువర్ ఆనర్ వాడు ఒప్పుకుంటున్నాడు!" అన్నాడు ఎ టు జడ్ రావ్ అతని పూర్తి పేరు డి. యస్. ఆర్ యస్ యల్. ఆర్. కె. పి. డి. యన్ యస్ రావ్.

"నేను ఒప్పుకోను" అన్నాడు మూర్తి

"ఒప్పుకోకపోతే ఈసారి మా యింటికొచ్చినప్పుడు కొబ్బరి నూనెతో గారెలు చేయించి, నీచేతే తినిపిస్తాను రాస్కెల్" అన్నాడు ఎ టు జడ్ రావ్.

"రామకృష్ణగారూ— థాంక్స్ సార్. ఇన్నాళ్లకి మీరు మా పెద్దబాస్ సినిమా తెప్పించారు— మీరు మా అసోసియేషన్‌కి వంద ఏళ్లు సెక్రటరీగా వుండి, ఈ నటుడి సినిమాలే తెప్పించవలసిందిగా చేయమని, ఆ భగవంతుడ్ని కోరుకుంటున్నాను." అన్నాడు చిదంబరం

రామకృష్ణ చిరునవ్వు నవ్వాడు "నీకు సన్మానంచేయిస్తా నుండవోయ్ చిదంబరం ఇంకా వంద సంవత్సరాలు ఈ సినిమాలు చూసేటంత ఓపిక నీకు వున్నందుకు మన తరఫున ఒక బిరుదు కూడా యిప్పిస్తాం" అన్నాడు.

"స్వప్నాడనం— ఎందె స్వప్నాడనం"అని వాణీ జయరాం పాడుతున్న పాట తీయగా వినిపిస్తోంది లోపల్నుంచి.

దాదాపు రెండు వందల పైనే వచ్చారు జనం.

నెల కోసారి కలుసుకుంటున్నారేమో, అందరూ ఒకళ్ల నొకళ్లు పలకరించుకోవటం. నవ్వుకోవటం అంతా సందడిగా వుంది.

"ఫిబ్రవరిలోనే గుంటూరులో ఎండలు మండి పోతున్నాయి సార్" అంటున్నాడు యజ్ఞనారాయణ

"మీరు మన దేశం వెళ్లారా?— తెలుగు సినిమాలు ఏవేం చూశారు. ముందు అది చెప్పండి!" అడుగుతున్నాడు రాజు.

"డి. వి. యస్. కర్ణ, కురుక్షేత్రం లలో ఏది బాగా పోయిందిట?" అడిగాడు లీలా ప్రసాద్.

"ఆవకాయ యింకా పెట్టి వుండరు!" అంటున్నది మృణాలిని, విశాలితో.

"యింకా పెట్టలేదు — ఏప్రిల్ లో సత్యనారాయణగారు గుంటూరు వెళ్ళినప్పుడు, ఆయనచేత పంపిస్తానంది మా అమ్మ" అంటున్నది విశాలి.

"సుప్రభాతం ... సుప్రభాతం..." అని జయచంద్రన్ మెలోడియస్‌గా పాడుతున్న పాటని ఆపేసి, సినిమా మొదలుపెడుతున్నామోచ్ అన్నట్టుగా గంటకొట్టాడు హాలువాడు.

## "మిల్క్ కేక్"

కావలసిన సామానులు .— చిక్కనిపాలు : 3 గ్లాసులు, పంచదార: 2 గ్లాసులు, నెయ్యి: ½ గ్లాసు, బొంబాయిరవ్వ: ¼గ్లాసు.

పై వస్తువులను కొలవటానికి ఒక గ్లాసును కొలత పాత్రగా వాడటం మంచిది.

తయారుచేయు విధము : దళసరి పాత్రలో పైన చెప్పినవన్నీ ఏకంగా కలుపుకోవాలి. తర్వాత ఈ మిశ్రమాన్ని స్టౌ మీద వుంచి గరిటతో కలుపుతూ వుండాలి. మిశ్రమం గరిట నంటుతూ జిగురుగా వుంటుంది. మిశ్రమమంతా యేకంగా కలసి చిక్కగ ఏర్పడుతుంది. నెయ్యి మీదకు తేలి పోయినప్పుడు, నెయ్యి పూసిన ప్లేటుమీద ఈ మిశ్రమాన్ని గుమ్మరించి ప్లేటంతా సర్దాలి. కొంతసేపు ఆరిన తరువాత మనకు కావలసిన షేపుల్లో బిళ్లలు చేసుకోవాలి. మిల్క్ కేక్ పాలకోవా రుచితో వుంటుంది ముఖ్యంగా గమనించవలసిం దేమిటంటే దీనిని తయారు చేయడానికి నీళ్లు వాడకూడదు. మంట మితంగా వుండాలి.

— ఎన్. భువనేశ్వరమ్మ




అంతేకాదు న్యూస్‌రీల్ కూడా లేకుండా సినిమా మొదలుపెట్టేశాడేమో — లోపల్నుంచి స్టైటర్ మ్యూజిక్ లాలూకు శబ్దాలు (రెండు ధ్వనులు) వినబడుతున్నాయి.

"అయ్యో తెలుగు సినిమా చూసేస్తున్నాం!" అన్నాడు మూర్తి ఫాన్ క్రింద సీట్లో కూర్చుని — అతని ప్రక్కనే లీలాప్రసాద్, ఎ.టి.జడ్ రావ్, సుబ్బారావ్ లనువను, చిదంబరంలు కూర్చున్నారు.

"మా పెద్దబాస్ సినిమా చూస్తున్నాం కనుక ప్రక్కన కామెంట్రీలు మాత్రం ఎవరూ చెప్పవద్దు — గప్‌చిప్ సాంబారు బుడ్డీలా సినిమా చూడండి అందరూ" ముందే వార్నింగ్ యిచ్చాడు చిదంబరం.

"గురూ — తెలుగు సినిమా చూస్తున్నంతసేపూ, నా నోరు వూరుకోదుమరి — కామెంట్రీ యివ్వక తప్పదు. నీకు యిష్టం లేకపోతే — దూరంగా వెళ్ళి కూర్చో — ఓకే?" అన్నాడు లీలాప్రసాద్.

"ఏ — నోట్ ఆఫ్ యూ కీప్ క్వయిట్ — పాట వస్తున్నది విననీయండి."

హీరో పల్లెటూరివాడు — సంక్రాంతి కాబోలు వచ్చిందిట, ఊళ్ళో ఆడా మగా అందరూ కలిసి డాన్సుచేస్తూ పాట పాడుతున్నారు. హీరో సంక్రాంతిమీద పాట మొదలుపెట్టి ఆదర్శనాయకుల గురించి కూడా పాడేస్తున్నాడు. దర్శకుడేమో, గాంధీగారు కర్ర పట్టుకుని నడవటం, బోసు ఉపన్యాసం యివ్వటం మొదలుపెట్టి ఏవేవో చూపిస్తూ భారత ప్రభుత్వ బహుమతికోసం, రాష్ట్రప్రభుత్వ సబ్సిడీకోసం నానా తంటాలూ పడుతున్నాడు.

భ ళు ం

హీరోయిన్ అమెరికాలో చదివిందిట — అందుకని ఎప్పుడూ పాంట్, షర్టు మాత్రమే కడుతున్నది. వాళ్ళ నాన్న పెళ్ళి చేసుకోమంటే 'నో డాడీ' అంటోంది ముద్దుగా.

"మూతి సున్నాలాపెట్టి అంటున్నది చూశారా — అలా మూతి సున్నాలా పెడితే నా కిష్టం" అంటున్నాడు ప్రసాద్.

ఆ పల్లెటూరుగాడ్ని నేను చేసుకోనంటే చేసుకోనంటే చేసుకోనంది హీరోయిన్ —

వాళ్ళ నాన్న గట్టిగా అరుస్తున్నాడు ఆ పిల్లమీద — ఈసారి మూతి సున్నాలా పెట్టకుండా మూతి ముడుచుకుని కూర్చుంది ఆ పిల్ల.

మృణాలిని వాళ్ళ అబ్బాయి మూడేళ్ళవాడు పెద్దగా అరుస్తున్నాడు — "ఈ సినిమా వొద్దే — యింటికి వెళదాం" అని —

"ష్ — హాల్లో సున్నాయిక్కడే బాగుంటుంది గోల చేయకు" అంటున్నది ఆవిడ.

"కోతి — కోతి — అటు చూడవోయ్ బాలకృష్ణా" లీలాప్రసాద్ ఆ కుర్రాడికి చెబుతున్నాడు.

"ఏదీ... ఎక్కడా..." అంటున్నాడు వాడు.

తెరమీద హీరో కోతిగంతులు వేస్తున్నాడు — ప్రక్కనో పదిమంది లావాటి అమ్మాయిలను పెట్టుకుని —

"నిగ నిగలు — పిటపిటలు, కసి కసి, నీలోపలి అందాలు అంటూ సంస్కృతంలో పాడుతున్నాడేమిటీ — యిది తెలుగు సినిమా కాదా!" అంటున్నాడు మూర్తి.

"ఇంతకు ముందు తెలుగులో రెండర్థాల పాటలు వచ్చేవి — అలాటి పాటలు వ్రాసిన వాళ్ళకి డాక్టరేట్లూ, పద్మశ్రీలు, ఆచార్య బిరుదులూ యిచ్చేసరికి, వాళ్ళు యింకా బరితెగించేసి యిప్పుడు ఒకటిన్నర అర్థం వచ్చే పాటలు వ్రాస్తున్నారు— యింకా కొన్ని సన్మానాలూ, వగైరాలూ జరిపించుకుని తర్వాత ఇక ఒకే ఒక అర్థం వచ్చే పాటలు వ్రాస్తారు అప్పుడుకాని తెలుగు సినిమాల్లోని సాహిత్యం చేరాల్సిన స్థాయికి చేరుకోదు!" కసిగా అన్నాడు ఎ టి జడ్ రావ్

అంటూనే లేచి బయటకు పోయాడు— "ఈ పాట అయిన తర్వాత కానీ హాల్లో అడుగు పెట్టనని" శపథం చేసి.

"పాట బయటకు వెళ్ళింది అనుకున్నాడు— నాకన్నయ్య, వెనక సీట్లో కూర్చున్నారు. వాళ్ళు చూడకుండా సిగరెట్టు లాగాలని బయటకు పోయాడు వాడు" రామకృష్ణ అన్నాడు

హీరోకి, హీరోయిన్‌కీ పెళ్ళి జరిగి పోతున్నది తెరమీద

"మాంగల్యం తంతునా. ." అంటున్నాడు పురోహితుడు.

"తెలుగు సినిమాలన్నింటిలో ఆస్థాన పురోహితుడు యితనే సుమా. ఇప్పటికి సుమారు వందల పైగా తెలుగు సినిమాల్లో నటించాట్ట" లీలా ప్రసాద్ అన్నాడు.

"దీని తర్వాత శోభనం సీను వస్తుందని పందెం, రాదని మూర్తి వాదించుకుంటే, మధ్యవర్తిలో ఏకీభవిస్తున్నాడ్ సుబ్బారావ్" అడిగాడు రామకృష్ణ

సుబ్బారావ్ ఏదో అనబోయేలోగా ఏకీభవించేలోపలే, శోభనం జరిగిపోతున్నది అమెరికా నుంచి వచ్చిన అమ్మాయి కనుక శోభనం పెళ్ళికూతురుకి పాంటు తొడిగారు దర్శకుడు.

"ఈ చిత్రంలో సందేశం ఏమిటో తెలుసా" అడిగాడు లీలా ప్రసాద్.

"తెలీదు— నువ్వు చెప్పొద్దు— చెప్పనక్కర్లేదు!" అన్నాడు చిదంబరం సీరియస్‌గా సినిమా చూస్తూ.

"పెద్దబాస్ సినిమా చూస్తున్నప్పుడు చిదంబరాన్ని డిస్టర్బ్ చేయకు. ఈ చిత్రంలో సందేశం చెబుతాను. అమెరికాలో ఆడవాళ్ళు

శోభనం గదిలో పాంట్లు వేసుకుంటారని'' అన్నాడు రామకృష్ణ.

''శోభనాలు, అలాటివీ అమెరికాలో వుండవు బుజ్జీ– అద్దంకి లో ఉంటాయి'' మూర్తి.

ఆ పిల్లని చీర కట్టుకోమంటున్నాడు హీరో – ఆ అమ్మాయికి చేతకావటంలేదు. అతను ''భారత సంస్కృతి – దానియొక్క విశిష్టత'' అన్న అంశముపై మూడు పేజీల వ్యాసం చదువుతున్నాడు.

అప్పుడే హాల్లోకి మళ్ళీవచ్చిన ఎటు జడ్ రావ్ 'హా–నా ఖర్మమిలా కాలెను కదా' అని చింతించుచూ కుర్చీలో చేరగిలబడి కూర్చున్నాడు.

ఆ పిల్ల మళ్ళీ మూతి సున్నాలాపెట్టి, హీరో భుజాల చుట్టూ చేతులు వేసి, దగ్గరకు లాక్కుని, అతని కళ్ళల్లోకి గోముగా చూస్తూ, ప్రేమగా పిలిచింది.

హీరో ఆమెను చటుక్కున విదిలించి కొట్టాడు.

''ఏమయింది – బల్లిగానీ ఏమయినా పాకిందా అతని మీద'' మూర్తి.

హీరో కోపంగా అంటున్నాడు ''నువ్వు భారత స్త్రీవి–భర్తను పేరుపెట్టి పిలవటానికి సిగ్గులేదూ – నీకు నోరెలా వచ్చిందసలు'' అంటూ మొదలుపెట్టి ''భారత దేశంలోని మొగాడిభార్య, ఆమె విధులు – పతివ్రతా ధర్మములు'' అన్న అంశముపై మరి నాలుగు పేజీల వ్యాసం చదవటం మొదలుపెట్టాడు.

''ఖర్మ – ఇదేం సినిమా బాబూ–పొరపాటున వచ్చాం!'' అంటున్నది అనుపమ.

''కొంచెం ప్రోగ్రెసివ్‌గా వుంటే, దేశం ఎక్కడ బాగుపడి చస్తుందో అని భయం మనవాళ్ళకి. చాదస్తం, మూఢనమ్మకాలూ, దేవుడి భయం, సనాతనత్వం, అంతా భారత సంస్కృతి పేరుతో రంగరించి రోజుకి మూడు ఆటలుగా జనానికి పట్టిస్తున్నాయి మన సినిమాలు. ప్రేక్షకులూ మూడువందల ఆటలూ ఆడించేసి శతదినోత్సవం చేయిస్తున్నారు. నిర్మాతలు, గొప్ప సెంటిమెంటల్ చిత్రం అని ఓపెన్‌గా ప్రచారం చేసుకుంటున్నారంటే, ప్రేక్షకుల మూఢత్వం మీద వాళ్ళకి ఎంత నమ్మకమో అర్థమవుతుంది'' కసిగా అన్నాడు ఎటు జడ్ రావ్.

''ష్... గోలచేయకు గురూ – సినిమా చూడనీ – డైలాగ్స్ వినపడిచావటంలేదు'' విసుక్కున్నాడు చిదంబరం.

హీరోకి, హీరోయిన్‌కీ ఏదో గొడవ వచ్చేసింది. వేరుపడిపోయారు.

''అమ్మయ్య సినిమాఅయిపోతుందేమో'' నిట్టూరుస్తూ అన్నాడు రావ్.

''అప్పుడేనా మళ్ళీ వాళ్ళిద్దరూ కలవాలి కదా...''

''అవునవును గ్రూప్ ఫోటో అదీ వుండాలికదా... తెలుగు సినిమా! త్రీ ఛీర్స్ టు యు!'' కళ్ళు మూసుకున్నాడు ఎటు జడ్ రావ్.

''ఇంట్రవల్ అదీ వుండదా నాయనా!''



# మాయాజాలం మణికట్టు



## మాయాదీప రహస్యం

మెజీషియన్ తాను రెండు చేతులలో రెండు వెలుగుతున్న కొవ్వొత్తులతో వేదికమీదకి వచ్చాడు.

ప్రేక్షకుల నుద్దేశించి నిలబడి, వున్నట్లుండి ఒక చేతిలోని క్రొవ్వొత్తిని ఆర్పేశాడు!

వెంటనే వెలుగుతున్న క్రొవ్వొత్తిని, ఆరిన క్రొవ్వొత్తికి పైన కొద్ది దూరంలో వుంచి బిగ్గరగా "కమాన్ గో" అని అట్టహాసం చేశాడు. అంతే. ఇంకేముంది! ప్రేక్షకులు చూస్తుండగా వెలుగుతున్న క్రొవ్వొత్తి నుండి ఒక దీపం ఆర్పివేసిన క్రొవ్వొత్తిని చేరి క్రొవ్వొత్తి వెలిగింది. ప్రేక్షకులు ఆశ్చర్యంతో చప్పట్లుకొట్టారు.

అది చూడటానికి ఎంత వింతగావుందో రహస్యం అంత చిన్నది. ఈ ప్రదర్శనలో రెండు క్రొవ్వొత్తులూ కాసేపు వెలగనిచ్చి, ఒక దానిని ఆర్పివేసి, వెంటనే, వెలుగుతున్న క్రొవ్వొత్తిదీపాన్ని ఆర్పి వేసిన క్రొవ్వొత్తి నుండి వచ్చే పొగ వరుసకి 3,4 అంగుళాల దూరంలో వుంచితే వెలుగుతున్న క్రొవ్వొత్తినుండి ఒక దీపం పొగ వరుస ననుసరించి ఆరిన క్రొవ్వొత్తిని చేరి క్రొవ్వొత్తి వెలుగుతోంది. దీపం పయనించడం చూడటానికిచాలా వింతగాలోస్తుంది.



ఈ ప్రదర్శనలో క్రొవ్వొత్తులు నాణ్యమైనవి ఎన్నుకోనడం ముఖ్యం – తర్వాత వెలుగుతున్న క్రొవ్వొత్తిని ఆర్పి వేసిన క్రొవ్వొత్తి నుండి వచ్చే పొగ ననుసరించి మాత్రమే వుంచాలి. వేరే ఏవైపు వుంచినా దీపం పయనించదు. రెండు క్రొవ్వొత్తుల దూరం 3 నుండి 6 అంగుళాలు దాటి వుండకూడదు

ఈ ప్రదర్శనకి ముందు 4, 5 సార్లు ప్రాక్టీసు చేయడం మంచిది.

"కమాన్ గో!" అనే మాట పైమకి వాడితే మీ మాట విని దీపం పయనించి నట్లు ప్రేక్షకులు భావించి ప్రదర్శన మరింత రక్తికడుతుంది.

కాని ఒక విషయం – ఈ ఐటం ఒకే ప్రేక్షకులముందు ఒకసారికంటె ఎక్కువసార్లు చెయ్యొద్దు.

– భావరాజు కామేష్

---

వెనక కుర్చీలోంచి రాజు అరుస్తున్నాడు.

"ఉండదు – నేనే ఇంట్రవల్ వద్దని కంటిన్యుయస్‌గా చూపించమని అప్పుకుట్టన్ నాయర్‌తో చెప్పాను!" రామకృష్ణ.

"ఏంబాబూ – తలుపులు తీస్తేమేము పారిపోతామనా?" లీలాప్రసాద్.

"కాదు! ఈ మూడున్నర గంటల మార్నింగ్ ఆటవల్ల, వాడి మ్యాట్నీ షో దెబ్బతింటే, ఈ జన్మలో మనకి సినిమాలు వేయడు వీడు – అందుకని!" అన్నాడు రామకృష్ణ.

హీరోయిన్, దాదాపు హీరోను మరచి పోయింది హీరో మాత్రం రకరకాలుగా ఆమె వెంట పడుతున్నాడు.

"నువ్వంటే నా కిష్టంలేదు – ప్రేమ అసలేలేదు – పైగా అసహ్యం నీలో సంస్కారంలేదు – సభ్యతలేదు నీకూ, నాకూ పడదు కనుక నీదారి నీది – నా దారి నాది" అని చాలా సూటిగా అచ్చ తెలుగులో చెప్పిందా పిల్ల, అతనికి.

## భశుం

అతనికి మరి అర్ధమవలేదో, అర్ధం చేసుకునే వుదేశ్యమే లేదో, ఆమెను మాత్రం వదలటంలేదు విడాకులకు ఆమె ప్రయత్నించేస్తుంటే, ఆ లాయర్‌ని పొడుస్తానని బెదిరించాడు. 'ఛీ పో' అన్నా, దేబిరిస్తూ ఆమె వెంటపడ సాగాడు సందు దొరికినప్పుడల్లా "భార్యా భర్తలు, వారి అన్యోన్యత", "సంసారం–స్త్రీల బాధ్యత" మొదలైన విషయాలపై అనర్గళంగా మాట్లాడుతున్నాడు.

తర్వాత సినిమా చాలా వంకర్లూ, మలుపులూ తిరిగీ, తిరిగీ, తిరిగీ, తిరిగీ– ఆ భార్యాభర్తల్నిద్దర్నీ కలిపింది ఆ భార్యా భర్తల మధ్య ఆనందం వుందో లేదో కానీ, ప్రేక్షకులకు మాత్రం ఆనందం కలిగింది

చివరకు అందరూ కలిసి నవ్వుకుంటు న్నారు. దాన్నే 'గ్రూప్ ఫోటో సీన్' అంటారు తెలుగు సినిమాల్లో

"నేనో జోకు చెప్పనా, సినిమా అయిపోయిన ఈ శుభ సందర్భంలో" అన్నాడు లీలా ప్రసాద్.

"వద్దుబాబూ. అంతపని చేయకు. ఇప్పటికే ముఖం వాచింది!" అన్నాడు రావ్.

"జోకు నాది కాదు మా గురూగార్లు ముళ్ళపూడి–బాపూలది"

"అయితే చెప్పు–"

"ఓ తెలుగు సినిమా ఎన్నో మలుపులు తిరిగి, ప్రేక్షకుల ప్రాణాలుతీసి, తీసి, చివరకు సుఖాంతం అయిందట. చివరగా 'శుభం' అని పడటానికి బదులు 'భశుం' అని పడిందట. విసుక్కుంటూ లేచిన ఒక పెద్దమనిషి "ఛీఛీ. ఇంత అవక తవక సినిమా నేనెప్పుడూ చూళ్లేదు!" అంటూ తుండుగుడ్డ దులుపుకొని భుజానేసుకుని చక్కాపోయాట్ట – అదీ కథ"

ఇదే 'భశుం' కథ.







# మీ బిడ్డలకు అమృతం
# పుష్టికరమైన అమృతం
# మీ పైరుకు అమృతం
# విజయ్



పిల్లలాగానే పైర్లు కూడా ఏపుగా పెరగాలంటే పుష్టికరమైన ఆహారం ఇవ్వాలి. అందుకై నత్రజని, భాస్వరం, పోటాష్‌లను అవసరమైనంతగా పైర్లకు వేయాలి. విజయ్ కాంప్లెక్స్ ఎరువుల్లో ఈ మూడు ముఖ్య పోషక పదార్థాలు సరియైన పాళ్ళలో వున్నాయి.

మీ భూముల, పంటల అవసరాన్ని గుర్తించి తయారు చేసిన కాంప్లెక్స్ ఎరువులే విజయ్ 17-17-17, విజయ్ 14-28-14, విజయ్ 24-24-0.

ఆసియాలో పెద్దది, అధునాతనమైనది అయిన మద్రాస్ ఫర్టిలైజర్స్‌వారి కర్మాగారంలో విజయ్ ఎరువులు మీకై తయారుచేయ బడుతున్నాయి.

విజయ్ ఎరువులనుగురించి ఇంకా వివరాలకు
ఈ క్రింది వారిని సంప్రదించండి.

ఏరియా మేనేజర్
మద్రాస్ ఫర్టిలైజర్స్ లిమిటెడ్
44, శాంతి నగర్ కాలనీ, హైదరాబాదు-500 028








? ? ? ? ? ? ? ? ? ?

# ఏమిటంటే... ఏమి చెప్పను???

! ! ! ! కకుభ ! ! ! !

? ? ? ? ? ? ? ? ? ?

నేను రచయితనని చెప్పడానికి ధైర్యం చాలదు. ఎందుకంటే పత్రిక ముఖం చూచిన కథల సంఖ్య కంటే పత్రికముఖం చూడని కథల సంఖ్య ఎక్కువ. అసలు నా కథలు అచ్చులో వచ్చినవి వేళ్ళమీద లెక్క పెట్టొచ్చు. ఇంకా చెప్పాలంటే వేళ్ళ మీద లెక్కకూడా అనవసరమే! ఇంతకీ నా కథలు రెండే రెండు పత్రిక ముఖం చూచినయి. నా స్నేహితులు మాత్రం 'ఒరే! రచయితా!' అని తప్పితే వేరే విధంగా పిలవరు. అలా వాళ్ళుపిల్చినప్పుడల్లా తప్పని సరిగా సిగ్గుపడతాను. అప్పుడప్పుడూ, వాళ్ళకు తోచినప్పుడు, 'నీ ఫ్యాన్స్‌లో చక్కటి అమ్మాయిలుంటే ఎంత బావుండును? చక్కా షికార్లకి చెక్కేయొచ్చు' అంటుంటారు.

"ఒరే! యిదన్యాయం! నాఅభిమానులతో మీరా షికార్లు చేసేది?!" కోపంగా అనే వాడిని.

"నోర్మూయ్యిరా! నీకు తోడు అభిమానులు. అందులోనూ అమ్మాయిలు" అంటూ గట్టిగా నవ్వేవాళ్ళు. చిన్నబుచ్చుకున్న ముఖంతో పుస్తకంలో తల దూర్చేవాడిని.

అలాటిది ఓ ఆదివారం...

అప్పటికి తొమ్మిదిన్నరయిందేమో!

అప్పటికే ఫ్రండ్సంతా మార్నింగ్ షో పిక్చర్‌కీ (కొత్తది) టికెట్స్ దొరుకుతాయేమోనని వెళ్ళారు. నేను మాత్రం 'ట్రిమ్'గా డ్రెస్సయి బైటికిరాబోతున్నాను.

సరిగ్గా అప్పుడే గేటు తీసుకుని ఓ అందమైన అమ్మాయి వచ్చింది. నాలుగిళ్ళ లోగిలి మాది. ఎవరి వాటాలోకి వెళ్తుందోనని కుతూహలంగా చూశాను. ఆశ్చర్యం! ఆ అమ్మాయి సరాసరి మా యింటికే వచ్చింది.

నోట మాటరాక అలాగే నిల్చుండి పోయాను.

"మీరే కదూ రచయితలు?!" నవ్వుతూ అడిగింది.

ఇంకా 'షాక్' నుంచి తేరుకోలేదు నేను. అలాగే నేనూ ఓ రచయితనని, ఆవిడ కేవలం ఓ అభిమాని అనికూడా మర్చిపోయి నిల్చున్నాను.

"మిమ్మల్నిచూడ్డం చాలా సంతోషంగా వుందండి!"

అంత అందమైన అమ్మాయి పనికట్టుకుని, ఏదో ఓ రెండు కథలు వడ్డ నేరానికి యించక్కా వచ్చి అభినందిస్తుంటే ఎవరు మాత్రం సంతోషించరు! నా కళ్ళు ఆ అమ్మాయినే చూస్తున్నా, చెవులు మాత్రం వినడంలేదు. ఊహాలోకంలో అందంగావుండే బోలెడు మంది అమ్మాయిలు నన్ను అభినందించడానికి పోటీపడుతూ వస్తున్నారు. ఒకరు దండలేస్తుంటే, మరొకరు ఆటోగ్రాఫ్ అడిగేవాళ్ళు. షేక్‌హేండ్ యిచ్చేవాళ్ళు, కెమెరా క్లిక్ మనిపించేవాళ్ళు! ఓహ్! ఆ దృశ్యం ఎంత తియ్యగా వుందో!!

"కూర్చోండి! కూర్చోండి!" ఎప్పుడూ ఎవరికీ చెయ్యనంత మర్యాదచేస్తూ అన్నాను.

ఇంతగా యీ అనామక రచయితని వెతుకుతూ వచ్చినందుకయినా కాఫీ యివ్వద్దూ! ఆవిడ నక్కడే కూర్చోపెట్టి కాఫీ యిద్దామనే సదుద్దేశ్యంతో, ట్రాన్సిస్టర్ ఆన్‌చేసి లోపలికెళ్ళాను.

"హమ్మో! రాక రాక నా అభిమాని, అందులోనూ వో అందమైన అమ్మాయి రావడం నా స్నేహితులు చూడలేదే అని చాలా బాధగా వుంది. ఆ సినిమా ఏదో అందకుండా వాళ్ళంతా తిరిగొస్తే బాగుండును. ఎంచక్కా గర్వంగా కాలరెత్తుకో వచ్చు. ఆలోచిస్తూ ఎన్నడూ కడగని కాఫీ కప్పుల్నికూడా కడిగి ఫ్లాస్కులో కాఫీ పోసి తీసుకొచ్చాను.

ఆశ్చర్యం!! కూర్చున్న ఆవిడాలేదు. ఆవిడ ముందున్న టీపాయ్ మీదెట్టిన ట్రాన్సిస్టరూ లేదు.

"ఒరే! ఏమిటిరా! అలా నిలబడ్డావ్? ఎవరికా కాఫీ?" దుమారంలా వచ్చారు మిత్రబృందం.

"అంత 'ట్రిమ్'గా డ్రెస్సయి ఆ ఏడుపు ముఖమేంటి?" చేతిలోని కప్పు లాక్కుని కాఫీ 'సిప్' చేస్తూ అడిగాడు రమేష్.

"ఒరేయ్! ఏమయిందిరా?" రాకేష్ జాలిగా అడిగాడు.

"ఏమిటంటే ఏమి చెప్పను? ఎందుకంటే ఎలా చెప్ప...నూ...! సద్దుమణిగిన యీ వేళ, నేనతి ఘోరంగా మోసపోయిన యీ... వేళ... ఏం చెప్ప...నూ..." అందమైన బుల్లి ట్రాన్సిస్టర్ గుర్తుకురాగా, వేలు పెట్టి, ఎప్పుడూ బుల్లి ట్రాన్సిస్టర్‌తో కళకళలాడ్తుండే, ప్రస్తుతం బోసిపోయిన టీపాయ్‌ని చూపెడూ, దిగాలుగా కూలబడ్డాను.





# రేయి ఎంతో హాయి



యన్. యస్. యన్. జవహర్‌లాల్

పగలు పదిగంటలు కావస్తోంది.

చిన్నసైజు రణరంగంలా ఉంది శాస్త్రి వంటిల్లు. ఉప్మా తిన్న ప్లేటు విసురుగా గిరాటువేసింది శ్యామల. తన కోపం మరోస్థాయి పెరిగిందని ప్రదర్శించేందుకు నిదర్శనంగా అలా ఏదో ఒకటి విసరటం శ్యామలకు అలవాటు. గిరాటు వేసిన ప్లేటు అంచుమీద నిలబడి మరో ఐదునిముషాలు నృత్యంచేసి గింగురుమనుకుంటూ పెద్దగా చప్పుడు చేసి శాస్త్రి కాళ్లముందు పడింది. శాస్త్రికి అయోమయంగా అనిపించింది. సగం తెరుచున్న నోరు, రెప్పవాల్చని అతనిచూపు శ్యామలకు ఏమాత్రం ఆశ్చర్యం కలిగించలేకపోయినయి.

చిందర వందరగా ఉంది ఆ కిచెన్ రూము. కత్తిపీట దగ్గర తరగమన్నట్లు కూరగాయలన్నీ పరుచుకు కూర్చున్నయి. అంతకుముందే పులుసులో 'పోపు' పెట్టిందేమో అది "చుంయ్" మంటూ చిటపట లాడుతోంది శ్యామల కోపంలాగానే.

"అమ్మా! తొందరగా నీళ్లు తోడవే, స్కూలు టైము అవుతోంది." అంటూ అరుస్తున్నాడు రవి.

"అమ్మా! పెరుగువాడు అరుస్తున్నాడే..."

"అమ్మా! 'చిన్ని' దొడ్డి కెళ్లిందే..."

అలా నలుగురు పిల్లలు నాలుగు రకాలుగా శ్యామలకు పనులు పురమాయిస్తున్నారు. దీనికితోడు శాస్త్రి. శాస్త్రి పొరపాటున కదిలించాడు. ఈమధ్యనే తోటి లెక్చరర్ భార్య 'బర్త్‌డే' ఫంక్షన్‌కి పిలిస్తే అందరు వెళ్లివచ్చారు. పొరబాటున అన్నాడు.

"కమల వాళ్లయిల్లు శుభ్రంగా, అందంగా ఉంటుం"దని అంతె, అప్పటి వరకు విశ్వప్రయత్నంతో కూడపెట్టుకు ఓర్పు తునాతునకలై ఎగిరిపోయింది శ్యామల నుంచి. దాని ఫలితమే ఈ ప్లేటు గిరాటు.

"అదిగో, ఆ తొందరే వద్దన్నాను శ్యామలా. నే చెప్పేది పూర్తిగా అర్థం చేసుకో. నా వాక్యం పూర్తి చెయ్యనీకుండానే..."

శ్యామలకు మళ్లీ చిర్రుతెత్తింది.

"అసలేమిటండీ! ప్రొద్దుట్నించి ఒకటే గోల ... రోజూ ఏ పుస్తకం చదువుకుంటూనో. రేడియో వింటూనో కూర్చుంటారు గదా! ఒక పక్క నేను నలుగురి పిల్లలతో చేసుకోలేక ఛస్తుంటే, కనీసం జాలయినా లేకుండా అనవసరంగా రాద్ధాంతం చేస్తారే..."

"తలతిక్కగా మాట్లాడకు శ్యామలా.

(51వ పేజీ చూడండి)



# వారఫలం

—మహేష్—

23–9–1977 శుక్రవారం మొదలు
29–9–1977 గురువారం వరకు

**మేషం.**— సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది వారం ఆఖరులో మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. స్త్రీలకు · ఆరోగ్యం బాగుండదు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి

**వృషభం:**— ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది స్త్రీలకు:—దైవకార్యాలు నెరవేరతాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**మిథునం:**— అనుకూలమైన వార్తలను వింటారు రావలసిన డబ్బు అందుతుంది వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. స్త్రీలకు :— ఆరోగ్యం బాగుంటుంది వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కర్కాటకం:**—ఆందోళన కలుగుతుంది. సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది. చికాకులకు గురికాగలరు వారం ఆఖరులో వృత్తివ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు :— కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**సింహం:**— రావలసిన డబ్బు అందుతుంది. పోటీవారిలో గౌరవం బాగుంటుంది. ప్రయోజనంగల సంభాషణలను జరుపగలరు. వారం మధ్యలో శ్రమకలుగుతుంది కొంతమందివ్యక్తులు మిమ్మల్ని మోసంచేయడానికి ప్రయత్నిస్తారు స్త్రీలకు ·— ఆరోగ్యం బాగుండదు. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**కన్య** — వృత్తిలో పోటీవారి పోటీ పెరుగుతుంది రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారలు బాగుంటాయి. మీ ఆలోచనలు ఫలిస్తాయి స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి.

**తుల.**— విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. మిత్రుల సహాయం లభిస్తుంది ఇతరుల నిమిత్తం శ్రమకు గురికాగలరు. మీ కార్యక్రమాలకు మార్పులు రాగలవు స్త్రీలకు ·—ఆరోగ్యం బాగుంటుంది ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**వృశ్చికం.**— ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది ఆర్థిక వ్యవహారల్లో మొగమాటాలు తగవు స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి సాహసిక వ్యవహారాలు బాగుంటాయి స్త్రీలకు — బంధుమిత్రులను కల్సుకొంటారు. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**ధనుస్సు** — మీ కార్యక్రమాలు చురుగ్గా సాగుతాయి సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. మిత్రులకు సహాయం చేస్తారు పోటీవారిలో గౌరవం లభిస్తుంది మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగిస్తుంది. స్త్రీలకు :— ఆరోగ్యం బాగుంటుంది దైవకార్యాలు నెరవేరతాయి.

**మకరం** — ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. మీ ఆలోచనలు ఫలిస్తాయి. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు. స్త్రీలకు : కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు

**కుంభం:**— మీ కార్యక్రమాలు బాగుంటాయి వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. పోటీవారిలో గౌరవం లభిస్తుంది విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణించగలదు. ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. స్త్రీలకు .— ఆరోగ్యం బాగుంటుంది. ప్రయాణాలోచనలు చేస్తారు.

**మీనం:**— చికాకులు యేర్పడతాయి. సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది వారం మధ్యలో వృత్తివ్యాపారాలుబాగుంటాయి. సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది విలాసవస్తువులు కొంటారు. ●

# హార్లిక్స్
# మీకు ఎక్కువగా అవసరమయినప్పుడు శక్తినిచ్చే కీలకపోషక పదార్థం.







### గర్భవతిగా ఉన్న కాలంలో

గర్భిణీ స్త్రీకి మంచి సమతూకంలో ఉండి, తేలిగ్గా జీర్ణమయ్యే ఆహారం అవసరం. అందువల్లనే గర్భిణీగా ఉన్నప్పుడు హార్లిక్స్ ఆదర్శప్రాయమయిన ఆహారం. ఇది తల్లికి, పిల్లకి కూడా శరీర నిర్మాణానికి కావలసిన మాంస కృత్తులు, కార్బోహైడ్రేట్లు సరిఅయిన సమ తూకంలో సమకూరుస్తుంది. రాత్రిళ్ళు సేవించిన మలబద్ధకం ఉండదు. ఉదయమే నిస్సత్తువగా ఉండటం పోతుంది.




### అస్వస్థత / అస్వస్థనుంచి కోలుకునే కాలంలో

జబ్బు చేసినప్పుడు మీ శరీరం ఎంతో విలువయిన మాంసకృత్తులు, పోషక పదార్థాలు కోల్పోతుంది. దీనివల్ల నిస్సత్తువ ఏర్పడుతుంది. ఈ నష్టాలను భర్తీ చేసేందుకు హార్లిక్స్ తేలిగ్గా జీర్ణమయ్యే రూపంలో శరీర కణాల నిర్మాణానికి కావలసిన మాంస కృత్తులు. శక్తి నిచ్చే కార్బోహైడ్రేట్లు ఖనిజాలు సమకూరుస్తుంది. దీనివల్ల మీరు త్వరగా కోలుకొంటారు. మళ్ళీ జబ్బు పడకుండా తట్టుకునే శక్తి ఏర్పడుతుంది.

## ప్రపంచమంతటా డాక్టర్లు సిఫార్సు చేశారు
## హార్లిక్స్ మంచి పుష్టికరమైనది

# ఈ జోకులకు నవ్వని వారిని.... నమ్మకండి!

జి.వి.జి.

**ప్రత్యేక సినిమా వినోదయానం ప్రారంభం!**

**"నేనో మంచి జోక్ చెప్పనా ?"**

*— రమాప్రభ*

జోరుగా వర్షం కురుస్తోంది. కారులో ఒక యువకుడు, యువతీ కూర్చొని, భలే జోక్ ఒకటి చెప్పకొని విరగబడి నవ్వు కుంటున్నారు.

అతను. "                    "

ఆమె "                    "

క్షమించాలి కారు కిటికీ తలుపులన్నీ మూసి వున్నందువల్ల వాళ్ళ జోక్ ఏమిటో నాకు వినిపించలేదు.

**షార్ట్‌హేండ్ !**

పద్మనాభం దర్శకత్వం వహిస్తూన్న ఒక సాంఘిక చిత్రం సెట్‌లో 'రెడీ ఫర్ టేక్' అనబోయి ఆగి, "చూశారా, మా కాస్ట్యూమ్స్ డిపార్ట్‌మెంట్‌లోని అసిస్టెంట్ తెలివితేటలు హీరో దగ్గర 'షార్ట్‌హేండ్' డిక్టేషన్ తీసుకునే చిన్న పాత్ర ఆ అమ్మాయిది అని చెబితే, ఆమెచేత 'పొట్టి చేతులు'న్న జాకెట్ తొడిగించి పంపించాడు చూడండి!" అని విరగబడి నవ్వసాగారు

***సారథి 'మాత్ర' !***

ఆరోజు నాకు విపరీతమైన తలపోటు ఫ్లూ జ్వరం వచ్చే లక్షణాలు కనిపిస్తున్నాయి

ఒక ఆస్ప్రో బిళ్ళ కొని, ఒక హోటల్లోకి దూరాను సర్వర్‌తో ఒక కప్పు వేడ్నీళ్ళు, ఒక కప్పు కాఫీ తెమ్మన్నాను అతను మరో నిమిషంలో తిరిగొచ్చాడు మాత్ర మింగేశాను

కాఫీ వస్తుందేమోనని ఎదురుచూస్తూండగా అతను బిల్లు తీసుకొచ్చాడు "కాఫీ ఏదోయ్ ?" అని అడిగితే, "ఇందాక మీరు మాత్ర మింగింది కాఫీతోనే కదండీ ?" అని జవాబిచ్చాడా సర్వర్.

***కేలండ ర్ ర్ ర్ !***

సెట్‌లో వేలాడుతూన్న ఓ కేలండర్‌ను చూసి, "దానికి కేలండర్ — అని ఆ పేరు ఎందు కొచ్చినట్లు చెప్మా ?" అన్నారు కె వి చలం

పక్కనే వున్న బాలకృష్ణ "తేదీ అయిపోగానే కాగితం చించేస్తే, డర్ ర్ ర్‌మని చిరుగుతుంది కదూ ? అందుకనేమో!" అన్నారు ఆవులిస్తూ

## రాజ్‌బాబు చెప్పిన జోకు !

సెట్స్‌కు కావలసిన విగ్రహాలు, వగైరాలు అత్యద్భుతంగా తయారుచేసే 'మోల్డర్' బ్రహ్మజీ ఒక రాత్రంతా మేల్కొని ఒక వినాయకుని విగ్రహాన్ని తయారు చేస్తున్నాడు — మర్నాటి ఒక పౌరాణిక చిత్రం షూటింగ్ కోసం బ్రహ్మదేవుడు ఏదో పనిమీద భూలోకానికి వచ్చినవాడల్లా 'మోల్డర్' బ్రహ్మజీ తయారు చేస్తూన్న ఆ విగ్రహాన్ని చూసి, "ఏమోయ్, నువ్వు బొమ్మలు తయారు చేస్తూంటావు నేనూ బొమ్మలు తయారు చేస్తూంటాను కాని, వాటికి నేను ఊపిరి పోస్తాను నా సృష్టికన్నా నీ సృష్టి ఏం గొప్పోయ్ ?" అని అడిగాడు

అందుకు 'మోల్డర్' బ్రహ్మజీ యిచ్చిన జవాబిది "దేవా! మీరు సృష్టించిన మనుషులకు ఎవరైనా పాదపూజ చేస్తారా ? నేను సృష్టించే ఈ వినాయకుని విగ్రహానికి రేపు సెట్‌లో హీరో హీరోయిన్‌లు పాదపూజ చేస్తారు ఏమంటారు ?"

***పొట్టిప్రసాద్ 'మాత్ర' !***

డైలాగ్‌లున్న కాగితాలను యివ్వగానే పొట్టిప్రసాద్ జేబులు తడువుకోసాగాడు

"ఏమిటండీ వెతుక్కుంటున్నారు ?" అని అడిగాడు డైరెక్టరు

"అబ్బే — ఏం లేదండి, ఇంత పొడుగాటి డైలాగ్‌లు ఉన్నప్పుడు — తడబడకుండా చెప్పేలా జ్ఞాపకశక్తిని వృద్ధిచేసే మాత్రను ఒక నాటు వైద్యుడు ఇచ్చాడు దాన్ని ఎక్కడుంచానో జ్ఞాపకం రావడంలేదు" అని పొట్టిప్రసాద్ ఇంకా వెతుక్కుంటూనే వున్నాడు

***అల్లు రామలింగయ్య ఆశీర్వాదం***

ఒక పెద్దమనిషి తన కొడుకుతో అల్లు రామలింగయ్య ఇంటికి వచ్చినవాడల్లా "వీడు మా అబ్బాయి అండీ ఎం బి బి ఎస్ పాసయ్యాడు త్వరలోనే ప్రాక్టీస్ పెట్టబోతు






న్నాడు ఆశీర్వదించండి మా చిరంజీవిని" అన్నాడు

'సిరంజీ'విగా వర్ధిల్లు నాయనా అని ఆశీర్వదించాడు అల్లు

**టేక్ యువర్ సీట్ !**

స్వర్గీయ రేలంగి ఆదిలో ఏదో పౌరాణిక చిత్రానికి ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్‌గా కూడా పని చేశారు. ఒకసారి ఆయన తన అసిస్టెంట్‌ను సెట్‌లోకి కావలసిన సరంజామా సప్లయ్ చేసే ఒక కంపెనీకి పంపిస్తే, ఆ అసిస్టెంటు ఒక పాత కుర్చీని జీప్‌లో తీసుకొచ్చాడు రేలంగి నిర్ఘాంత పోతూ, "ఏమిట్రా ఇది ? నిన్న ఆ కంపెనీలో నేనొక సింహాసనం చూసొచ్చాను దానిని తీసుకు రమ్మని పంపిస్తే, ఈ పాత కుర్చీని తీసుకొచ్చా వేమిట్రా ?" అని అడిగారు

దానికా అసిస్టెంటు "ఆ కంపెనీకే వెళ్ళానండి ఎదురుగా ఒక మనిషి కనిపిస్తే, మీరు పంపించినట్లు చెప్పానండి ఆయన 'టేక్ యువర్ సీట్' అని ఈ కుర్చీ నాకు చూపించి, లోపలికి ఏదో పనిమీద వెళ్ళాడండి ఇదేననుకొని జీపులో వేసి తీసుకొచ్చేశానండి" అనేసరికి కీ శే రేలంగికి ఏడ్వాలో నవ్వాలో తోచలేదు ○

"వినాయకుడు" అన్న మాట
తెనుగు సినిమాకవి రాయలేదు కాని
అందులోనూ రెండర్థాలు వున్నాయి

ప్రతి చీకటిరాత్రి ఎప్పుడో ఒకప్పుడు తెల్లవారుతుంది!
ప్రతి పాపాత్ముడికి ఏదో ఒకనాడు పశ్చాత్తాపం కలుగుతుంది!!



అన్నపూర్ణ పిక్చర్స్

# ప్రేమలేఖలు

నిర్మాత
దుక్కిపాటి మధుసూదనరావు బి.ఎ.

దర్శకుడు
కె. రాఘవేంద్రరావు బి.ఎ.

నవయుగ




## టూ కీ

★ విజయ మాధవీ పిక్చర్స్ రంగుల్లో నిర్మిస్తున్న చిత్రం ఆగస్టు 31 తో పూర్తవుతుంది అక్కినేని జయచిత్ర కలిసి నటిస్తున్న మొదటి చిత్రం యిది ఈ చిత్రానికి వడ్డె శోభనాద్రిగారు నిర్మాత తాతినేని రామారావు దర్శక కథకుడు

★ ప్రముఖ నటి, దర్శకురాలు శ్రీమతి జి వరలక్ష్మి ఎల్డామ్స్ రోడ్డులోని తన స్వంత భవనంలో యాక్టింగ్ స్కూల్ స్థాపించింది ఔత్సాహిక నటీనటుల దగ్గర్నుంచి రోజుకు వంద ఉత్తరాలు వస్తున్నాయి

సెలెక్షన్ కమిటీ సభ్యులుగా శ్రీయుతులు డి రామానాయుడు, కె ఎస్ ప్రకాశరావు, కె రాఘవేంద్రరావు, ప్రకాష్ ప్రభృతులు వుండగలరని, సంస్థ స్థాపకురాలు జి వరలక్ష్మి చెప్పింది

★ రామకృష్ణ ఆర్ట్స్ వారి "గడుసు పిల్లోడు" వర్ణ చిత్రం అక్టోబర్ 7 వ విడుదల చెయ్యదలచినట్టు, నిర్మాత రామకృష్ణారెడ్డి తెలిపారు తండ్రిగా శోభన్, తనయుడుగా శోభన్ నటించిన ఈ రంగుల చిత్రానికి వసూళ్ల బాపయ్య దర్శకుడు

★ బాలాజీ చిత్ర వారి మంచిబాబాయ్' వర్ణ చిత్రానికిగాను, డాక్టర్ నారాయణరెడ్డి, వేటూరి సుందరరామ్మూర్తి వ్రాసిన ఆరు పాటలకు, మహదేవన్ ట్యూన్ సమకూర్చడం జరిగింది బాబుల్‌నాథ్ లక్ష్మణరావుగార్లు నిర్మిస్తున్న ఈ చిత్రానికి టి కృష్ణ దర్శకుడు

★ ప్రత్యగాత్మగారి శిష్యుడు శ్రీ కట్టా సుబ్బారావు "వియ్యాలవారి కయ్యాలు" చిత్రానికి దర్శకుడుగా పని చేస్తున్నారు ఈ చిత్రాన్ని జె రాధాకృష్ణమూర్తి నిర్మిస్తున్నారు

బాకీ పేజీ 36

# సినిమా హాస్యాంగణ

## రేలంగి నుంచి ఇవాళ్టి రమాప్రభ దాకా

# తెనుగు చిత్రాలలో హాస్యం!

**అయిదారు సంవత్సరాల తెలుగు చిత్రాలను పర్యావలోకనం చేస్తే, మన చిత్రాలలో హాస్యం సహజంగా వుందా అన్నది సంశయంగానే మిగిలిపోతూంది**

అసందర్భంగా అల్లబడిన హాస్య సన్నివేశాలను జొప్పించడంవల్ల, చిత్రాలకు మేలు కన్న కీడు ఎక్కువగా జరిగింది అన్నది ప్రేక్షకులు నిరూపించిన సత్యం.

నవరసాలలో కరుణ, శృంగారరసాల తరువాత ప్రాధాన్యత వున్నది హాస్యరసానికే. మన చిత్రాలలో వచ్చే వినోద ఘట్టాలు మనల్ని నవ్వించలేకపోగా, పరిహాసానికి గురి అవుతున్నాయి.

హాస్యం అపహాస్యం అవడానికి కారణం ... కథకులా, దర్శకులా, హాస్య నటీనటులా ?

మనం ఎక్కువగా ఇతర భాషా చిత్రాలను, మన భాషలో నిర్మించడంవల్ల, అందులో వున్న కామెడీని తర్జుమా చెయ్యడం, అసహజత్వానికి దారితీస్తూంది.

### కథలలో లోపమా ?

ఇప్పుడొస్తున్న కథలలో, హాస్య పాత్రలంటూ ఏమీ సృష్టించబడనందువల్ల, అప్పటికప్పుడు దర్శకులు, నిర్మాతలు ఏదో కొంత వినోదాన్ని తమ చిత్రాలలో జొప్పించడం మూలంగా, సహజత్వం లోపిస్తూంది.

హాస్య నటీనటులు, పాత్ర స్వభావాన్ని అర్థం చేసుకోక, పెద్ద పెద్ద కేకలు పెట్టి, వారి సంభాషణలతో ప్రేక్షకులను తికమకపెట్టడం జరుగుతూ వుంది.

మన చిత్రాలలో వస్తున్న ''కామెడీ'' కథతో సంబంధంలేక, ఫోర్స్‌డ్‌గా వుండడంవల్ల, ఆ రసానికి రాణింపు రావడం అసంభవం అనిపిస్తుంది.

### అరవడం హాస్యమా ?

పైగా మన హాస్యనటులు అరవడమే నటన అనుకుని, వారి డైలాగులను మరీ వేగంగా, అర్థరహితంగా పలకడం వల్ల, ప్రేక్షకులను నవ్వించలేకపోతున్నారు.

స్వర్గీయ రేలంగిగారివలె ''సటిల్ కామెడీ''ని అందివ్వగలనటులు మనకు ప్రస్తుతం వున్నారా? మన హాస్య నటులే నిరూపించాలి.

హాస్యరసాన్ని పోషించే కళాకారులు, అప్పటికప్పుడు తమ సొంత భావనలతో దృశ్యాన్ని రక్తికట్టించడానికి ప్రయత్నించాలిగాని, రచయిత రాసిన గీతలను వల్లించడం మాత్రమే తమ పని అనుకోరాదు.

### రేలంగి రాజ్యం

స్వర్గీయ రేలంగి, శివరావు, లంకా సత్యం



అమరదీపంలో జైమాలిని

గార్లు రెండు దశాబ్దాలు హాస్య రాజులుగా రాజ్యమేలినా, వారి ''నటన''లో బోర్ ధ్వనించలేదు. చిత్ర చిత్రానికి ఏదో కొంత కొత్తదనాన్ని వారు సృష్టిస్తూ వచ్చారు.

కొన్నాళ్లకు బాలకృష్ణ, పద్మనాభం, నల్లరామ్మూర్తి ... సీతారామ్‌గార్లు ప్రేక్షకులకు కొత్తరకం హాస్యాన్ని అందివ్వగలిగారు.

''హాస్యానికి కొత్త నిర్వచనం యిచ్చిన ప్రతిభావంతుడు అల్లురామలింగయ్య. ఏ పాత్ర నిచ్చినా, దానికి తన ''నటన''తో ప్రత్యేకతను తెస్తున్నారు గాబట్టి, ఆయన లేని తెలుగు చిత్రం రావడంలేదేమో అనిపిస్తుంది.''

తరువాత రాజబాబు కొన్ని సంవత్సరాలు ''మకుటంలేని హాస్య రాజు''గా ప్రజలచేత కీర్తించబడ్డారు.

ఇప్పుడు సూడా, సారధి, చిట్టిబాబు, పొట్టిప్రసాద్, రావికొండలరావుగార్లు వారి వారి పరిధికి తగ్గట్టు హాస్యాన్ని అందివ్వడానికి ప్రయత్నిస్తున్నారు.

### గయ్యాళి హాస్యం

గయ్యాళితనంలో కూడా హాస్యం వుంది అని సూర్యకాంతం, ఛాయాదేవిగార్లు యిప్పటికీ నిరూపిస్తున్నారు.

హాస్యాన్ని మోతాదులో అందిస్తేనే, ప్రేక్షకులను ఆకట్టుకుంటుంది అని గుర్తెరిగి తదనుగుణంగా రమాప్రభ పాత్రపోషణ గావిస్తూ అందరి నటిగా ప్రకాశిస్తూంది.

### అక్కినేని హాస్యనటుడా ?!

మన కథానాయకుల్లో హాస్యరసాన్ని అవలీలగ పోషించగల ప్రజ్ఞ అక్కినేనిగారికి వుందని ''తెనాలి రామకృష్ణ, మిస్సమ్మ, అర్ధాంగి, చక్రపాణి'' చిత్రాలునిరూపించాయి.

### మార్పు కావాలి

అనుకరణ, కోణంగి అభినయం, అర్థంగాని సంభాషణం లాంటి విష పద్ధతులకు స్వస్తి చెప్పినప్పుడే, తెలుగు చిత్రాలలో హాస్యం జీవిస్తుంది. —శ్రీనివాస్*

వినాయక

చవితి సంచిక

## "ఇనాయకుల స్వామీ! సిన్నకోరిక"

-మాడా

ఇనాయకుల స్వామికి దండాలండే! నా పేరు మాడా అండే! మీతో రెండు మాటలు మాట్లాడా
లండే! మీరు చానా గొప్పోళ్లండే! చావా అదృష్టవంతు
లండే! అన్ని పనులకు ముందు అందరూ మీ పేరే
తల్చుకుంటారండె! మిమ్మల్నే పూజిస్తారండె! యిందులో
యేదో కిటుకుంది గదండె! నిజానికండె! మీ తొండం,
మీ బొజ్జ చూస్తే నవ్వ బుద్దేస్తదండె! కాని
అందరూ దండాలెడ్తారెండు కండె! నాదో సిన్న కోరి
కండె! నాకూ ఒక తొండాన్ని, పెద్ద బొజ్జనూ ప్రసాదిం
చండె. ఈఢికేమైనా పిచ్చట్టిందా అనుకోకండె. తెరమీద
నేను మాట్లాడుతూ, నటిస్తూ
వుంటే జనం నవ్వుతున్నారండె. నన్ను
సూడగానే వాళ్ళు నవ్వాలంటే ఎలాగండె!
అందుకే మీరు తొండం, బొజ్జ నాకిచ్చారనుకోండె,
తప్పకుండా వాళ్ళు నవ్వుతారు గదండె! ఈ జన్మకు
అలా కుదరదని మీరంటారనుకోండె! ఏం చేద్దాం!
వచ్చే జన్మలోనైనా మీ కొడుగ్గా పుట్టేట్టు దీవించండె! హాస్యంమీద గ్రంథమంటూ
ఎవరైనా రాస్తే, ఏ మారుమూలైనా ఈ "మాడా" పేరు వుండేట్టు నన్ను దీవించు స్వామే!

## మందహాసం మోసం



మాయలమరాఠీ! ఏమీ తెలియనట్టు ఎంత అమాయకంగా నటిస్తున్నావ్! ఎంతమందిని మోసగించావ్ ఆ మందహాసంతో. చూడకు. నన్నలా చూడకు. నీ మందహాసాన్ని చూస్తేనే నాకు మంటేస్తుంది. కాదు నవ్వొస్తుంది. భయమేలా! నేనుండ దిగులేలా! అని అభయమిస్తున్నట్టు నటిస్తూనే రావా! నా దరికి రావా అంటూ ఎంతమందిని నీలో చేర్చుకుంటున్నావ్! ఆడే నాటకం ఆడుతూ, చేసే భూటకం చేస్తూ యింకా ఎందుకీ ముసుగులో గుద్దులాట! నీ అసలు రూపమేమిటో ప్రదర్శించు. నిన్ను తలచుకున్నప్పడల్లా నా రెండేళ్ల పసిపాప గుర్తొస్తూంది. అందం, తెలివితేటలు, చురుకుతనం ప్రసాదించి, ఏ జబ్బూ చేయకుండా రెండే రెండు సెకన్లలో నా బిడ్డను చంపేశావ్! ఆడుకుంటూ ఆడుకుంటూ చచ్చిపోయిన నా బిడ్డను తలచుకుంటే నా కేడుపు రావడంలేదు. విరగబడి నవ్వాలనిపిస్తుంది. ఉదయం లేవగానే రోజూ నీ ఫొటోకు దండం పెట్టే ఒక కుందనపు బొమ్మను నీ దగ్గరకు రప్పించుకున్నావని అనుకుంటేనే నాకు నవ్వాగడంలేదు. ఒక పసిపిల్ల ఎలాంటి అనారోగ్యంతో బాధపడకుండా రెండే రెండు సెకన్లలో ప్రాణం వదలిపెట్టిందంటే అది హాస్యాస్పదం కాదా! పిచ్చిదాన్నని నన్ను చూచి నవ్వకు. నిన్ను చూచి నేనే నవ్వుతున్నాను. సముద్రమంత బొజ్జలో ఇంకెందర్ని దాచుకున్నావ్. నీ బొజ్జ చాలా ప్రమాదమైనదిలా కన్పిస్తూంది. ముందు నీకా బొజ్జ లేకుండా చెయ్యాలి. ఆ మార్గమేమిటో ఆలోచిస్తున్నా! ఈరోజే ఆ విషయంపై రిసెర్చ్ ప్రారంభిస్తున్నా!

—ఛాయాదేవి



## గణపతయ్యా!

ఏమయ్యో! గణపతయ్యా! విన్నావా! ఈ వైపరీత్యాన్ని? ఎంత దారుణం? వాళ్ల కష్టమేదో వాళ్ళు పడుతూ హాయిగా సంసారాన్ని సాగించే మొగుడు, పెళ్ళాన్ని చూచి ఎందు కేడుస్తుంది ఈ లోకం! యిది అక్కసు కాదంటావా! కాక మరేమిటి? సినిమావాళ్ళు పెళ్లి చేసుకుని సుఖంగా వుండడం తప్పా! లేక నేరమా! సినిమావాళ్లంతా చెడ్డోళ్ళు, చెడిపోయినోళ్లు అంటుంటారు కొందరు. ఈ విషయంలో నువ్వేకీభవిస్తావా! ఏకీభవించవని నాకు తెల్సు. ఎందుకంటే అందరూ చెడ్డోళ్ళు, చెడిపోయినోళ్లు కారు, కాలేరు గనుక. ఏం! బయట ప్రపంచంలో వున్న అందరూ పరమ నిష్టాగరిష్టులా! కాదు అని ఎప్పటికప్పుడు ఋజువౌతూనే వుందిగా. వివరంగా చెప్పమంటావా!

నీ దయవల్ల అందమైన భర్త దొరికాడు నాకు. అందుకు నేనెంతో మురిసిపోతున్నాను. నన్నర్థం చేసుకునే మంచి మనసును అతనికి ప్రసాదించినందుకు మరింత మురిసిపోతున్నాను. మా సంసారం బాగానే సాగుతుంది. మావారు సినిమాల్లో నటించడం మొదలెట్టాక కొన్ని

## ఎంతెంత దూరం?...





# వింటావా ?

కొత్త సమస్యలు ఎదురౌతున్నాయి మాకు. "మీ అందానికి దాసోహం" అంటూ ఊహాగీతాలు, ఉత్తరాలు తెగ రాసేస్తున్నారు కాలేజి భామామణులు. "మీరే నా దైవం మీరే నా సర్వస్వం" అంటూ కవిత్వం రాసేస్తున్నారు. ఇది న్యాయమంటావా! పిచ్చిమాలోకం అని వూరుకోమంటావా! నువ్వే మంటావ్! నువ్వేమీ అనవులే. నే చెబుతున్నా విను. ఇలాంటి రాతలు వ్రాసేవారికంటే సినిమావాళ్ళు ఎంతో నయం. తమ పేరు యెక్కడ బయట పొక్కుతుందో అనే భయమైనా వుంటుంది వాళ్ళకి. కానీ వీళ్ళకు ? ఏ భయమూలేదు. మరి నువ్వు విఘ్నేశ్వరుడవు కదా! ఇలాంటి రాతల్ని విఘ్నం చెయ్యలేవా! ఆ భామామణులకు నచ్చచెప్పలేవా! నేను చెప్పిన విషయాలు జ్ఞాపక ముంటాయా! సారీ! దేవుడూ. ఇంతసేపూ బోర్ కొట్టించానా! ఏం చెయ్యనుమరి! నేను కొలిచే దేవుడివి నువ్వే అయినపుడు నా కష్టసుఖాలు నీతో చెప్పక ఎవరితో చెప్పను! అయినా ఇదేం పాడుబుద్ధి. పరాయి స్త్రీ మొగుడుమీద యెందుకా మోజు!మరి నే వుంటానయ్యో! విఘ్నేశ్వరా! -రమాప్రభ







# వినాయక్ జీ నమస్తే!

నమస్తే. వినాయక్‌జీ. నమస్తే. కుశలమేనా! ఎలా వుంది మీ లోకం ? బాగానే వుంటుంది. ముమ్మాటికి మా లోకంలా వుండదు. ఎందుకుంటుంది మరి! మీలాంటి బడాబడా వాళ్ళంతా అక్కడే కొలువై వుండగా ఆ లోకానికేం కొఱత? ఎటుతిరిగి మా లోకానికే కొఱతలు, కలతలు. సరే. లోకాల విషయం వదిలేద్దాం. మరేదైనా విషయం గూర్చి చర్చిద్దాం. ఇంతకూ చర్చనీయాంశంగా దేన్ని పట్టుకుందాం! నాకు తెల్సు నువ్వు వులకవు, పలకవని. మరి నేనూ వూరకుంటే యెలా! ఎన్నాళ్ళమంచో అనుకుంటున్నా నిన్నొక విషయం అడగాలని. నా మతిమరుపు మండిపోను ఆ విషయ మేమిటో జ్ఞప్తికి రాదేం! వచ్చింది. జ్ఞాపకాని కొచ్చింది! ఏమిటని అడగవేం! నేనే చెబుతానన్నప్పుడు నువ్వెందు కడుగుతావ్. అయితే విను. నా సందేహాన్ని తీర్చు. నేను ఇంతప్పటినుంచి నిన్ను పూజిస్తున్నాను. ప్రతి వినాయకచవితి రోజున భక్తితో నీమీద శ్లోకాలు చదువుతున్నాను. "తొండమునేకదంతము తోరపు బొజ్జయు వామ హస్తమున్" అంటూ స్తుతిస్తున్నాను ఇక్కడే నాకొక చిన్న సందేహం. "తొండమునే దంతమా లేక తొండమనేక దంతమా ?" ఏమిట పిచ్చి ప్రశ్న అని వేళాకోళంగా వుందా! నేనడి దాంట్లో అర్థం లేకపోలేదు. నీకు ఒక్క దంతవే వుండొచ్చు. కానీ నా దృష్టిలో అది ఒక్క దంతం కాదు. ఎంతోమంది దుష్టుల్ని శిక్షించి మరెంతోమంది శిష్టుల్ని రక్షించడానికి యెన్నో దంతాల కలయికతో ఏర్పడిన ... మంత్రదండ ఆ దంతం అని నా నమ్మకం. అందు "తొండమనేకదంతము" అంటే బాగుంటుంద నా అభిప్రాయం. ఇందుకు నువ్వెలా గు సమాధానం చెప్పవు. కనుక నీ భక్త ప్రతినిధు చేతనైనా చెప్పించు. వారూ చెప్పరంటావా ఈ ధర్మసందేహాన్ని జనసందోహానికే వదిలేస్తున్నాను. వచ్చే వినాయకచవితి లోపు సమాధాన రాకపోతుందా! ఉంటా మరి. టాటా! మళ్ళీ కలుద్దాం.

- రాజ్ బాబు

## శోభన్ దీపల ఇష్టారాజ్యం

పాలుగారే ఆమె బుగ్గలు, మగసిరి గల అందగాడిలో తీరని కోరికల్ని రేకెత్తించడం సహజమేగదా!

ఆమె వాలుచూపులు, అతగాడి హృదయంలో వలపు తలపులను రేకెత్తించాయి.

ముద్దులొలికే ఆమె ముఖం, అతగాడికి కోటి వెన్నెలకాంతుల నిచ్చాయి.

ఇద్దరూ ఒకర్నొకరు తదేకంగా చూసుకుంటూ తన్మయులై ఉండిపోయారు.

"ప్రేమించుకుందాం" అంటూ అతడు పాట ప్రారంభించాడు. "ఎవరేమన్న ఏమన్నగానీ", అంటూ ఆమె చొరవ తీసుకుంది. "గాలిలో ఊగుతూ జోలలా" అంటూ అతడు ఆమెను దరి చేరాడు. "పూలలో తేలుతూ తావిలా", అంటూ అతడ్ని పెనవేసుకుంది. అలా ప్రేమికులిద్దరు ఎంతసేపు గాఢమైన కౌగిలింతకు గురి అయ్యారంటే ... వారి ఇష్టమొచ్చినంతవరకు.

ఈ సరస శృంగార రసభరిత రమణీయ దృశ్యం లక్ష్మి ఫిలింస్ కంబైన్స్ వారి రంగుల చిత్రంలో ప్రత్యేక ఆకర్షణగా వుంటుంది.

యువతరాన్ని ఉత్తేజపరిచే శృంగారపు జంటగా శోభన్ ... దీప ఎంతో సహజంగా నటించారు. "వలపుపాటల మొనగాడు" నారాయణరెడ్డి వ్రాసిన పాటను, సత్యం సారథ్యంలో సుశీల ... బాలు మధుర మధురంగా పాడారు.

శోభన్ దీపల యిష్టారాజ్యాన్ని వివిధ భంగిమల్లో, దర్శకుడు ఎస్. డి. లాల్ కొత్త రీతిలో చిత్రీకరించారు.

శ్రీమతి అనురాధాదేవి నిర్మిస్తున్న ఈ వర్ణ చిత్రంలో శోభన్ ద్విపాత్రాభినయం ఎక్సలెంట్‌గా వుంది.

శ్రీమతి కృష్ణవేణి సమర్పణలో, విజయకుమార్ నిర్మాణతలో సింగారించుకునే ఈ చిత్రం దీపావళికి విడుదలవుతుంది. →

"మనుషులు చేసిన దొంగలు"

# గణపతి ఎంతపాతవాడు?



*బిక్కవోలు గణపతి !*

***క్రీ. శ. 4–5 శతాబ్దాలలో ప్రచారంలోకి వచ్చిన గణపతి పూజ 7–8 శతాబ్దాలనాటికి ఎంతో ప్రచారాన్ని పొందింది.***

పదవ శతాబ్దం నాటికి హైందవులలో గాణపత్యులనే ప్రత్యేక శాఖ ఏర్పడింది. మలబారు ప్రాంతంలో వీళ్ళు ఎక్కువగా వున్నారు. 'మూర్తీభవించిన విజ్ఞానమే గణపతి' అన్నాడు హోవెల్. బౌద్ధులకు, జైనులకు కూడా గణపతి యిష్టదైవం. క్రమంగా గణపతి పూజ ఆశియాలో వ్యాప్తిచెందింది.

## వినాయకుడైన ఏనుగుతల యక్షుడు

గణపతి విగ్రహాల్లో అతి ప్రాచీనమైనవి ఎలిఫెంటా, ఎల్లోరా, బదామి గుహల్లో వున్నాయి. గుప్తుల కాలంలో గణపతి పూజ ప్రచారంలోకి వచ్చిందని విజ్ఞుల అభిప్రాయం. కుషానుల కాలానికి చెందిన గణపతి - విగ్రహం ఏదీ కనిపించదు. తొలి దశలో గణపతి ఒక యక్షుని రూపంలో మధుర, అమరావతి శిల్పాలలో కన్పిస్తాడు. ఏనుగు తల వున్న యక్షుడు క్రమంగా గణపతిగా మార్పు చెందటం మొదట గుప్తుల కాలంలో జరిగింది.

## పంచమూర్తులు

స్థానక, ఆశీన, నృత్త, యానక, దేవీసహిత మూర్తులుగా గణపతి విగ్రహాలను విభజించవచ్చు. నిల్చుని వున్న రూపం స్థానకమూర్తి. ప్రసన్న గణపతి అనికూడా పిలువబడే ఈ రూపంలో గణపతి నిటారుగానో లేక శరీరంలో రెండు మూడు వంపులతోనో నిలబడి వుంటాడు. నాలుగు చేతులలో ముందున్నవి అభయ ముద్రలతో, వెనుక వున్న రెండు చేతులలో పాశము, అంకుశము ధరించి వుంటాడు. హరింద్ర గణపతి లేదా రాత్రి గణపతి రూపంలో పాశాంకుశాలను, దంతము, మోదకములను కలిగివుంటాడు. వియత్నాంలోని తురాన్ మ్యూజియంలో స్థానక గణపతి విగ్రహం ఒకటి వుంది. ఆ విగ్రహానికి ఏనుగు తల వున్నదిగానీ కిరీటం లేదు. అలాంటివి భారతదేశంలో గుప్తుల కాలంనాటి శిల్పాలలో, శాలంకాయకుల, విష్ణుకుండినుల కాలానికి చెందిన వాటిలో కన్పిస్తాయి. కిరీటం ధరించిన విగ్రహాలు చాళుక్యుల, హొయసల, కాకతీయశైలి శిల్పాలలో కన్పిస్తాయి. అంతేకాక భారతదేశపు తొలి విగ్రహాల్లో గణపతికి రెండు చేతులే వున్నాయి. విజయనగర కాలానికి చెందిన తాడిపత్రి, లేపాక్షి ఆలయాల్లో స్థానక గణపతి విగ్రహాలు వున్నాయి. తాడిపత్రి రామలింగేశ్వరాలయంలో గణపతి పాశాంకుశ ధనుర్బాణధారిగా కన్పిస్తాడు.

## కిరీటంలేని గణపతి

ఆశీనమూర్తి విగ్రహాల్లో గణపతి కూర్చొని వుంటాడు. నాలుగు చేతుల్లో సాధారణంగా పాశాంకుశాలు, మోదకము, దంతము వుంటాయి. ఇలాంటి విగ్రహాలు లేపాక్షి, శ్రీశైలం మొదలైన చోట్ల వున్నాయి. తంజావూరు బృహదీశ్వరాలయంలో, పుల్లమంగై బ్రహ్మపురీశ్వరాలయంలో గణపతి పద్మంపై ఆశీనుడై వున్నట్లు చెక్కబడింది. శ్రీలంకలోని పొలన్నరువలో శివాలయ స్తంభం ఒకదానిపై ఆశీన గణపతి శిల్పం వుంది. ఎడమచేతుల్లో ఒకదానిలో మోదకము వున్నది. ఇటీవలే ఔరంగాబాదులో బయటపడ్డ ఒక గుహ లోపలి భాగంలో మూడు వైపులా శిల్పాలున్నాయి. ఎదురుగా వున్న గోడపై ఆశీన గణపతి విగ్రహానికి కిరీటం లేదు. దానికి ఎడమవైపు మహిషాసురమర్దని, కుడివైపు గోడపై సప్తమాతృకలు, ఎడమవైపు గోడపై బుద్ధుని విగ్రహం వున్నాయి. ఈ గుహ క్రీ. శ. 6–7 శతాబ్దాల నాటిది.

## ఆరు చేతుల వినాయకుడు

నృత్త గణపతికి ఎనిమిది చేతులుండాలని వాటిలో ఏడింటిలో పాశ, అంకుశ, మోదక, కుఠార, దంత, వలయ, అంగుళీయములు వుండాలని శిల్పశాస్త్ర నిర్దేశం. మంగోలియాలోని నృత్త గణపతి విగ్రహాని కొకదానికి నాలుగు చేతులున్నాయి. ఆ చేతుల్లో పరశు మోదకములున్న పాత్ర, త్రిశూలం మొదలైనవి వున్నాయి. హంపీ హజార రామాలయంలో నృత్తగణపతికి నాలుగు చేతులున్నాయి. కుడి చేతులలో పరశు, దంతము, ఎడమ చేతులలో సర్పము, మోదకము వున్నాయి. కాళహస్తి శిలా శిల్పాలలో ఒక నృత్త గణపతికి ఆరు చేతులున్నాయి. లేపాక్షి, తాడిపత్రి, శ్రీశైల దేవాలయాల్లో కూడా నృత్త గణపతి కన్పిస్తాడు.

యానకమూర్తి లేక హేరంబ గణపతి రూపంలో గణపతికి అయిదు శిరస్సులు, పది చేతు లుండి, సింహంపై కూర్చుని వుండాలని శిల్ప శాస్త్రాలు చెప్తున్నాయి. ఇలాంటి లోహపు ప్రతిమ నాగపట్టణంలోని నీలాయతాక్షి అమ్మన్ ఆలయంలో వున్నది. ఒక తల, పది చేతులు గల హేరంబ గణపతిని తాడిపత్రి రామలింగేశ్వరాలయం గోపురంపై చూడవచ్చు.

## దేవీ సమేతుడు

దేవీసహిత మూర్తి లేక శక్తి గణపతి రూపంలో వినాయకుడు దేవీ సమేతుడై

*భువనేశ్వర్‌లోని స్థానక గణపతి*



ఫొటోలు — వ్యాసం : **డా॥ వేమూరు కామేశ్వరరావు**





ఆసీన గణపతి : ఔరంగాబాద్



ఉచ్ఛిష్ఠ గణపతి : శ్రీశైలం

వుంటాడు. కొన్ని శిల్పాలలో గణపతి ప్రక్కన లేక తొడపై ఒక దేవి వుంటుంది. ఆమెను లక్ష్మి అంటారు. తాడిపత్రి రామలింగేశ్వరాలయ గోపురంపై లక్ష్మీగణపతిని చూడవచ్చు. ఇందులో గణపతి శంఖచక్రములు, దంతము మూడు చేతుల్లో ధరించి నాలుగవ చేతితో దేవిని ఆలింగనము చేసుకున్నట్లు చెక్కి వుంది. తిరువాలంజులి దేవాలయంలో వినాయకునికి ఒకవైపు బుద్ధి మరోవైపు సిద్ధి అనే దేవత లున్నారు. నేపాల్‌లో దొరికిన కాంశ్య విగ్రహ మొకదానిలో గణపతికి ఐదు తలలు, పది చేతులు వున్నాయి. కుడి కాలు సింహంపై మోపి ఎడమ తొడపై దేవిని కూర్చుండబెట్టుకొన్నట్లున్నది.

ఉచ్ఛిష్ట గణపతిది ప్రత్యేకమైన రూపం. దీనిలో గణపతి వొడిలో దేవిని కూర్చుండబెట్టుకుని కామకేళికి ఆయత్తమవుతున్నట్లు శిల్పింపబడాలని మంత్ర మహార్ణవము, ఉత్తర — కామికా గమనములలో చెప్పబడింది. శ్రీశైల మల్లికార్జున దేవాలయ ప్రాకారం వెనుకవైపు గోడపై ఇలాంటి విగ్రహం చెక్కబడి వుంది.

## బృహస్పతి కూడా గణపతే!

గణపతి పూజ ఎప్పుడు ప్రారంభం అయిందో, కాలగతిన ఈ దేవుని స్థితిగతులలో వచ్చిన మార్పులేమిటో ఇంకా స్పష్టంగా తెలియదు. మొదట యక్షనాగ సంబంధి అయివుంటాడని కొందరు పండితుల భావన. ఇతడు శైవదేవత అన్నది అందరికీ తెలిసిందే. శివుడు కూడా గణేశ్వరుడు కావటమే దీనికి కారణం కావచ్చు. బృహస్పతికి కూడా గణపతి అన్న నామాంతరం వుంది. అందుకే యితన్ని బుద్ధికి సంబంధించిన దేవుడిగా భావించాడు. బ్రహ్మవైవర్త పురాణంలో గణపతి కృష్ణుని ప్రతిరూపంగా చేర్చబడింది. ఏది ఏమైనా గణపతి పూజ ఆరవ శతాబ్దికి ముందు విరివిగా జరిగినట్లు కనిపించదు. ★

# "టెంకాయ స్వామి"తో మీ డ్రాయింగ్ రూమ్‌ను అలంకరించండి!

**దేవుడికి కొబ్బరికాయ కొట్టేక, లోపలి గుజ్జును మనం పచ్చడిగానో, కూరగానో పచ్చిగానో తినేస్తాము. రెండు చిప్పలు మిగులుతాయి**

వీటిని పొయ్యిలో పారేయకుండా డ్రాయింగ్ రూమ్‌లో అలంకార వస్తువుగా కూడా చేసుకో వచ్చు దీనికి ఎన్నో వస్తువులు, చాలా శ్రమ అక్కరలేదండి రెండు కొబ్బరి చిప్పలు ఒకదాని పీచుతో సహా — ఈ రెండింటిని తిరిగి అతికించే టందుకు అడ్‌హెసివ్ బంక ఫెవికాల్, అరాల్‌డైట్ లాంటి దేదైనాసరే కాషాయి రంగు పాత సిల్కు గుడ్డముక్క. పూజారిగారు కొడితే 'ఠపీ' మని మధ్యకి పగులుతుందే అట్లా కొబ్బరికాయని 'కొట్టాలి'. ఈ చిప్పలని 'సీటు'గా అతికిం చేయాల. పాత బ్లేడుగాని, కొత్త గరుకు కాగితం — (సాండ్ పేపరు) గాని పెట్టి నున్నగా అయ్యేదాకా పైన గల పీచులన్నీ 'పీలిక' తప్ప గీకేయాలి. ఇక పైనున్న కొబ్బరిపీచుని నాలుగు వేపులా క్రిందికి త్రిప్పి బొమ్మలోలాగా నల్ల దారంతో ముడి వేయాలి. స్వామివారి తలమీద ముడి అన్న మాట యిది. ఇక గెడ్డం ఆకారంలో పీచును కత్తిరించి అతికించాలి. నున్నగా వున్న భాగంలో ఇండియన్ యింక్‌తో కళ్ళూ ముక్కూ తీర్చిదిద్దాలి. "నుదుట" ఎర్రని నామం పెట్టాలి! పెదవులకి కూడా ఎర్రని లిప్‌స్టిక్ వుంటే రాయ వచ్చును. ఇక "కొబ్బరిపీచు స్వామిగారు" తలదాకా తయారయ్యారు, శరీరం కావాలిగా ఈ తల కాయను ఒక హార్లిక్సు ఖాళీ సీసామీద పెట్టాలి! సిల్కు గుడ్డను దానిమీద "మెడచుట్టూ" వచ్చినట్లు కనపడేలా వేసి దాన్ని బల్లమీద పెట్టాలి. పూసల దండలు రుద్రాక్ష మాలలు వేస్తే... "స్వాములారు" రెడీ అవుతారు, ఫోటో చూస్తే మీకే సులువుగా అర్థం అవుతుంది! ★

ఫోటో : వ్యాసం : శ్రీమతి విజయప్రసాద్

ఇలా వుంటాడు బాగా చేస్తే స్వామివారు









విజయమాధవి కంభమ్మ ఒత్రంలో అక్కినేని జయచిత్ర

సంహాస్వప్నం లో కార్తీక

 హాలీవుడ్ స్వర్ణయుగం మీద నిర్మిస్తున్న

***హాలీవుడ్!***

***అందులోను 1930 – 1940 మధ్య వైభవంగా గడచిన పది సంవత్సరాల స్వర్ణయుగం అప్పటి*** సినిమాలు అందులోని తారలు–వాళ్ల గొప్పతనం–వాళ్ల వింత కథలు – వీటి గురించి చెప్పుకుంటేనే పులకింతలు కలుగుతాయి

ఇవాళ ఆ హాలీవుడ్ లేదు అలనాటి చిత్రాలున్నాయి! 40 సం॥ల వయస్సు పైబడ్డ వాళ్లు వాటిని చూసి యెలాగూ పరమానందాన్ని పొందుతారు గాని – యీ మహా వేగంలో – పైలా పచ్చీసు వయసులో 'ఘూమ్మని' కొట్టుకుపోతున్న కుర్రకారు కూడా వీటిని చూసి చకితులై పోతున్నారు–తాదాత్మ్యం చెంది చూస్తున్నారు ఆ పాత గుబాళింపులు–మధురిమలు అట్లాంటివి!

"ఆర్థర్ నైట్" గారు మంచి సినిమా విమర్శకుడు – వృత్తిలో అధ్యాపకుడు – ఆయన తన విద్యార్థుల బృందానికి 1930 నాటి సున్నిత మైన బయస్కోపులు కొన్ని చూపించాడు థియేటర్ బయటికి వస్తూన్న యువతి ఒకామె కన్నీళ్లు వొత్తుకోడం అతను గమనించాడు – ఒక యువకుడు యిట్లాంటి సినిమాలు యిప్పుడు తియ్యరేమిటండీ' అంటూ బాధా, కోపం వెలిబుచ్చాడు

అందుకనే యీమధ్య హాలీవుడ్‌లో పాత సినిమాలను మళ్లీ తియ్యడం – పాత సినిమాలలో 'మరుపురాని మధుర స్మృతులుగా మిగిలిపోయిన తారామణుల విచిత్ర గాథలను ఎంచి చిత్రాలుగా మల్చడం – అవి గల్లాపెట్టె దగ్గర సంచలన చిత్రాలు'గా మారిపోడం జరుగుతున్నది

టెలివిషన్ కూడా వెండి తెరలాగే అలనాటి 'చిత్ర మధురిమ'లను తన చిత్రాలకు కథావస్తువుగా యెంచుకుంటున్నది!

## "సన్‌సెట్ బూల్‌వార్డ్"

'సన్‌సెట్ బూల్‌వార్డ్' 1930 నాటి హాలీవుడ్ స్వర్ణయుగంలో – తారాపథాన శోభాయమానంగా వెలిగి – వెలసిపోయి గతానేక మధుర స్మృతులలో జీవిస్తూ – తిరిగిరాని ఆ తియ్యని రోజులు మళ్లీ వస్తాయేమోనని చూసే ఒక (మాజీ) అందాల తార దయనీయమైన కథ!

ఒక సీనులో ఆ వృద్ధ అందాల తార – తన చిన్నవయస్కుడైన ప్రియునితో – ఒక పురాతన శిథిల భవనంలాగ వున్న తన యింటి హాలులో కూర్చుని – పాత బయస్కోపులను – కేవలం మూకీ చిత్రాలను చూస్తూంటుంది

ఒక దశలో ఆమె ఆవేశభరితయై చిర్నవ్వు చేస్తుంది తెరమీద కదులాడే అందాల మొహాలను చూసే ఈమె మొహం మీద ప్రొజెక్టర్" లోని 'దీప' కాంతి ప్రతిఫలించి – ఈమె మొహం కూడా రాగరంజితమైనట్లుంటుంది

'ఒహ్హో! ఇంకా ఇప్పటికీ ఆ మొహాలు చూడు యింకా ఎంతో అందంగా వున్నాయి



'ప్రయాణంలో పదనిసలు'లో ఒక దృశ్యం



'భలే అల్లుడు'లో అల్లు రామలింగయ్య, శారద

## టూ కీ - టా కీ

★ పారతీ స్టూడియోస్ త్వరలో నిర్మించబోయే సాంఘిక చిత్రానికి త్రిపురనేని, మహారథి రచన చేయడానికి, హోటల్ సరోవర్‌లో మకాం పెట్టారు.

★ శ్రీమతి విజయనిర్మల దర్శకత్వంతో రూపొందనున్న "సంఘం చెక్కిన శిల్పాలు" వర్ణచిత్రంలో కృష్ణ... విజయనిర్మల ముఖ్య పాత్రలను పోషించగలరని, డాక్టర్ నారాయణరెడ్డి వ్రాసిన ఆరు పాటలకు, రమేష్‌నాయుడు స్వరాలు సమకూర్చడం మద్రాసులో జరిగిందని తెలుస్తోంది.

★ రాజ్యం పిక్చర్స్ రంగుల్లో నిర్మించబోయే పౌరాణిక చిత్రం "ద్రౌపది"లో అగ్రనటి వాణిశ్రీ టైటిల్ పాత్రను పోషించగలదని, కమలాకర కామేశ్వరరావు దర్శకత్వం నిర్వహించగలరని తెలిసింది. శ్రీధరరావు... లక్ష్మీరాజ్యం నిర్మాతలు.

★ శ్రీ రామానాయుడుగారు నలుగురు నాయకులతో భారీ స్కేప్ వర్ణచిత్రాన్ని, కొత్త సంవత్సరంలో ప్రారంభించగలరని తెలిసింది. ఎవరా నాయకులు? వివిధ భాషా చిత్ర నాయకులా! తెలుగు చిత్ర నాయకులా! అదే సస్పెన్స్. ➔

# కొత్త హాలీవుడ్ సంచలన చిత్రాలు!





తొడుగుతున్న దృశ్యం. ఈ సినిమా 1976 లో [illegible].

అవును ... ఆ మొహాలే మాకు అందాలు ... అవే మాకు పదివేలు..." అంటూ ఆమె 'డ్రమటిక్'గా తన చూపుడువ్రేలుతో చూపెట్టే ఒక దృశ్యం ప్రేక్షకులను కదిలించివేసింది...

ఈ సినిమాలో "గ్లోరియా స్వాన్‌సన్" మాజీ హాలీవుడ్ తారగాను ఆమె 'ప్రేమికుని'గా విలియమ్ హోల్డన్‌లు అద్భుతంగా పాత్రలలో జీవించారని అన్నారెందరో...

గ్లోరియా స్వాన్‌సన్ అంటుంది "మాకప్పుడు డైలాగులు లేవు ... నటన వుంది ... కాని యీ డైలాగులు – కనిపెట్టినవాడిని అనాలి..." అని ఎకసక్కెంగా. అవును ఇరవై అడుగులు పెడల్పైన వెండితెర మీద బంగారు 'తార'ల్లాగా వెలిగిన వీళ్ల 'నటన'ను 'అందాన్ని' అవి ఇచ్చే ఆనందాన్ని ఈ తరం ప్రేక్షకులు పోగొట్టుకున్నారు.

అందుకనే పాత సినిమాలకు కొత్త చిత్రీకరణలు! అప్పటి 'తారల' కథలకు "భారీ నిర్మాణం" యివాళ ముమ్మరంగా వుంది!

ఉదాహరణకి క్లార్క్‌గేబుల్ అప్పుడు 'రాజా' వెలుగు వెలిగిన హీరో. కెరోల్‌లాంబర్డ్ అతని హీరోయిన్! నిజ జీవితంలో ఆ యిద్దరూ 'దంపతులు' తెరమీద అద్భుతమైన 'జంట' ఆ యిద్దరి ప్రేమ కథలే "గేబుల్ అండ్ లాంబర్డ్" అన్న చిత్ర కళాఖండం!

ఈ కొత్త సినిమాలో 'క్లార్క్'గా కొత్త నటుడు "జేమ్స్ బ్రోలిన్" "కెరోల్‌గా" కొత్త తారామణి "జిల్ క్లేబర్గ్"లు నటించారు... ➔



# హాలీవుడ్...చిత్రాలు

పాత చిత్రాలను ఆధారంగా తీసిన 'సల్లివాన్స్ ట్రావెల్స్'' లో చక్కని సామాజిక విమర్శకూడా వుంది. అట్లాగే ఈ విజయచిత్ర పరంపరలో ''ది డే ఆఫ్ ది లూకస్ట్'' ''ది వైల్డ్ పార్టీ''లు గొప్ప ఆదరణ పొందాయి.

మెల్‌బ్రూక్ తీసిన ''సైలెంట్ మూవీ'' నిజంగా మూకీ చిత్రమే! అందులో ఒకే ఒక్క డైలాగుంది పాత హాలీవుడ్ 'వాసనలు', 'కళ' అంతా ఈ చిత్రం — పులకింపజేసే నేపథ్య సంగీత ధ్వనుల సాయంతో పునికిపుచ్చుకుని — మరీ రాణించింది!

1974 లో హాలీవుడ్ పాత చిత్రాల కదంబ చిత్రం 'దట్స్ యెంటర్‌టయిన్‌మెంట్'' వచ్చి ప్రేక్షక హృదయాలను దోచుకుంది. మళ్లీ యీ మధ్య తీసిన ''దట్స్ యెంటర్‌టైన్‌మెంట్ - 2'' అన్న ద్వితీయార్థ చిత్రా — సంగీత వినోదభరిత చిత్ర భాగాలను కూడా ఏర్చి కూర్చుకొని ఇంకా 'మనోహరంగా' తయారైంది! ఎమ్. జి. ఎమ్. వారి పాత కళాఖండాల నుంచి అద్భుతమైన భాగాలు యిందులో పొందుపరిచారు. మహా తారలు జీన్‌కెల్లీ; ఫ్రెడ్ ఆస్టెయిర్; మార్క్స్ బ్రదర్స్; మారీ డ్రెస్లెర్; స్పెన్సర్ ట్రేసీ; కాథరీన్ హెప్‌బర్న్ లాంటి వారంతా యిందులో [ప్ర]దర్శన మిస్తారు.

ఇప్పటి గొప్పతారలు, నిర్మాతలు దర్శకులు — అప్పటి తారల వేషాలు తిరిగి వేయడానికి,

← 'చిల్లరకొట్టు చిట్టెమ్మ'

ఆ గడచిపోయిన వైభవాన్ని, తెర కెక్కించడానికి తమ తపస్సు ధారపోస్తున్నారు.

## టెలివిషన్‌మీద

టెలివిషన్ ఇందుకు తీసిపోలేదు! ''ఫిట్జ్ గెరాల్డ్ ఇన్ హాలీవుడ్'' అన్న ''టెలి చిత్రం''లో జేసన్ మిల్లర్ ''ఫిట్జ్ గెరాల్డ్'' వేషం వేశాడు. అతని భార్య ''జెల్డా''గా ''ట్యూస్‌డే వెల్డ్'' నటించింది. ఈ చిత్రంలో ప్రఖ్యాత సినిమా కాలమిస్టు షీలాగ్రాహమ్ వేషాన్ని జూలియాఫాస్టర్ కట్టింది — షీలాగ్రాహమ్‌కి ఫిట్జ్ గెరాల్డ్‌కి చివరి దశలో చిన్న ప్రణయ గాథ వుంది!

ఇంకా చలనచిత్రాలుగా తయారవుతున్న హాలీవుడ్ కథలెన్నో వున్నాయి.

క్రయిమ్‌ఫిక్షన్ (నేరం), సైన్సుఫిక్షన్ (విజ్ఞానం) పీటమధ్య నలిగిపోతున్న అమెరికన్ ప్రేక్షకులకు యీ పాత చిత్రాలు సరికొత్తవిగా, కళాత్మకంగా కనపడుతున్నాయి.

డబ్ల్యూ. సి. ఫీల్డ్స్, మే వెస్ట్, పాల్‌మునీ, ఎర్రోల్‌ఫ్లిన్ — చివరికు మారిలిన్ మన్రో దాకా అలనాటి అపురూప తారలంతా తిరిగి యిప్పటి 'తారల' రూపకల్పనలో వెండి తెర మీదకు అవతరిస్తున్నారు!

ఈ ''హాలీవుడ్ పిచ్చి'' — విపరీతంగా జనాన్ని ఆకర్షిస్తుందని సినిమా నిర్మాతలు, నిపుణులు నమ్ముతున్నారు... కొందరు మాత్రం ''యెన్నాళ్లుంటుంది? ఎంత వుంటుంది?'' అని అనుమానిస్తున్నారు.

అమెరికా ''మోషన్ పిక్చర్ అసోసియేషను'' అధ్యక్షుడు జాక్‌వాలెంటి మాత్రం యిలా అభిప్రాయ పడుతున్నారు. — ''మళ్లీ సినిమాలకి రోజులొచ్చాయి. ఇవి జనాన్ని పెద్దపెట్టున ఆకర్షిస్తున్నాయి వాళ్లకు వాళ్ల జీవితంలోకి తొంగిచూసే 'కాంతి' లాంటిది కావాల. పాతకాలపు ''పాత్ర''ల మనోజ్ఞత వాటి శీలసంపదలోని వైవిధ్యం దీన్ని వాళ్లకు యివ్వగలుగుతున్నాయి! జనానికి బ్రహ్మాండమైన హీరోలు — జీవితంలో అనుసరించదగ్గవారు ప్రేక్షకులకీ కావాలి — సినిమా తారలు కనీసం ఆ పెద్ద హీరోలను వేషాలు వేసైనా చూపించగలరు''—

''పాత హాలీవుడ్'' మీద యిప్పటి హాలీవుడ్ కొంత జాగ్రత్తగానే ''పణం'' వొడ్డుతున్నది. ఎందుకంటే నిర్మాణ వ్యయం యివాళ చాలా ఎక్కువ... అయితే కళాఖండానికి పైకం రాదు — పైకం మూరగొన్న చిత్రమే పేరు ప్రఖ్యాతులన్నీ దోచుకుంటూంది! కాని ''కళాత్మకం పణాత్మకం'' అయిన అరుదైన చిత్రాలే అసలైన 'హిట్' చిత్రాలు!!

[ఎడ్గార్ హెచ్. డిలిస్లెప్స్ వ్యాసం ఆధారంగా * * *]



## టూకీ - టాకీ

★ జగపతి అధినేత శ్రీ వి. బి. రాజేంద్ర ప్రసాద్‌గారు "నటరత్న... నటసామ్రాట్"గార్లతో నిర్మించనున్న స్కోప్ వర్ణచిత్రానికి లొకేషన్ ఎంపిక చేసే నిమిత్తం ఆగస్టు చివరి వారంలో కలకత్తా వెళ్ళినట్టు తెలిసింది.

★ ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ నిర్మాత శ్రీ ఎ. వి. సుబ్బారావుగారు కథల నిర్ణయం నిమిత్తం, కలకత్తా వెళ్ళారు. అక్కినేని... ప్రత్యగాత్మగారి కలయికలో కొత్త సంవత్సరంలో పి. ఎ. పి. చిత్రం ప్రారంభమవుతుంది.

★ కలర్ చిత్రాలపట్ల ప్రజలు ఎక్కువ ఆసక్తిని కనపరుస్తారు అనేది ప్రచారం నిజం కాదని "ఇదెక్కడి న్యాయం...చిలకమ్మ చెప్పింది... ఓ మనిషీ తిరిగి చూడు" చిత్రాలు నిరూపించాయి.

★ అజయ్ ఆర్ట్స్‌కు (జైహింద్ సత్యం) అక్కినేనిగారు డిశంబర్ నుంచి కాల్‌షీట్లు యిచ్చారు. తాతినేని రామారావు దర్శకుడు.

★ ప్రతాప్ ఆర్ట్ ప్రొడక్షన్స్‌వారి "సూర్య చంద్రులు" అక్టోబర్‌లో జరిగే షెడ్యూలుతో పూర్తవుతుంది. తమిళ రచయిత గుహనాథన్ దర్శకుడు. విజయనిర్మల నాయిక.

## ఆగస్టు 12న పుట్టిన వర్ధమాన నటి మాధవి

### మాధవికి మంచి రోజులు

తెలుగు సినిమా రంగానికి వచ్చిన మరొక భవిష్యత్తు తార మాధవి. ప్రముఖ దర్శకుడు దాసరి విజయలక్ష్మిని మాధవిగా మార్చారు, "తూర్పు...పడమర" చిత్రం కోసం. అప్పుడు ఆంధ్ర సచిత్ర వార పత్రికలో మాధవికి పుజ్వల భవిష్యత్తు వుందని వ్రాశాడు యీ విలేఖరి.

ఇప్పుడామె మరిన్ని చిత్రాలలో నటించబోతున్నట్టు తెలిసింది. ఇటీవల తన "పుట్టిన రోజు"ను స్థానిక హిస్‌గ్రోవ్‌లో వైభవంగా జరుపుకుంది.

మాధవి కథానాయికగా నటించిన "ఊరుమ్మడి బ్రతుకులు" చిత్రానికి అవార్డు వచ్చింది. కాబట్టి, మాధవిని అవార్డు నటి అనవచ్చు.

"విజయ... మాధవీ పిక్చర్స్‌వారి వర్ణచిత్రం, విజయలక్ష్మి మూవీ క్రియేషన్స్, టి. గోపాలకృష్ణ రూపొందించే బంగారు బాట... కాలం చెప్పిన కథ" చిత్రాలలో మాధవి ప్రాధాన్యత వున్న పాత్రలను పోషిస్తోంది.

### బాలచందర్ చిత్ర నాయిక?

"అంతులేని కథ" చిత్రాన్ని నిర్మించిన నిర్మాత శ్రీ అరంగణల్ తలపెట్టిన రెండో చిత్రంలో నాయికగా నటించే బంగారు అవకాశం మాధవికి వచ్చింది.

బాలచందర్ వంటి గ్రేట్ డైరెక్టర్ దగ్గర పనిచేసే అవకాశం అందరికీ లభించేది కాదు. కోరివచ్చిన వరలక్ష్మిని మాధవి ఆనందంతో అంగీకరించిందో... ఆమె నటజీవితం శోభాయమానం అవుతుంది.

బాలచందర్‌గారి దర్శకత్వంలో నాయికగా నటించడం... మాధవి అంతస్తును పెంచుతుంది.

"దాసరి... బాపు... మధుసూదనరావు... తాతినేని రామారావు" వంటి ప్రముఖుల చిత్రాలలో నటించిన మాధవికి బాలచందర్‌గారి చిత్రం రావడం... ఆమెకు మరింత గౌరవాన్ని తెచ్చిపెడుతుంది.

'నాయుడు బావ' లో
విజయలక్ష్మి, జయసుధ, శోభన్‌బాబు



# నాయికగా ప్రవేశించిన శుభ

నాయికగా పరిశ్రమలో ప్రవేశించి ఆ తర్వాత క్యారక్టర్ యాక్టరు నయాననని 'మొరటోడు' చిత్రంలో నటిస్తున్న కుమారి శుభ చెప్పింది. కీర్తిశేషుడు వేదాంతం రాఘవయ్యగారి కుమార్తె శుభ బి. ఎస్‌సి. వరకు చదివింది. సినిమాలలో ఆమె చేరడం రాఘవయ్యగారికి ఇష్టంగా వుండేది కాదట. ఒక కుమార్తె అయినా సినిమాలలో ప్రవేశిస్తే బాగుంటుందని ఆమె తల్లి సూర్యప్రభ అభిప్రాయపడినారట.

ఎలాయితేనేం ఆమె ఫొటో చూచిన తర్వాత తండ్రి ఆమెకు అనుమతి యిచ్చాడట. కుమారి శుభ నటించిన మొదటి చిత్రం "వట్టిక్కాడా పట్టణమా" అనే తమిళ చిత్రం.

"చాలామంది తారలు చిన్న చిన్న పాత్రలలో నటించి, ఆ తర్వాత హీరోయిన్లవుతారు. కాని నా విషయంలో అందుకు భిన్నంగా జరిగింది. 'గూడుపుఠాణీ' చిత్రంలో శ్రీ కృష్ణ ప్రక్కన హీరోయిన్‌గా తొలుత నటించాను. ఆ తర్వాత అన్నీ కారక్టర్ పాత్రలే వస్తున్నాయి." అని ఆమె చాలా ఉల్లాసంగా చెప్పారు విజయవాడలో నేను కలుసుకొన్నప్పుడు.

"ప్రేమలేఖలు", "గంగా—యమున—సరస్వతి" వంటి చిత్రాలలో కుమారి శుభ నటించింది.



చిత్రలేఖనం, పుస్తకాలు చదవడం ఆమె హాబీలు.

— వి. ఎస్. అవధాని ★

### శ్యాంప్రసాద్‌కు రాఘవేంద్రరావు

శ్యాంప్రసాద్ ఆర్ట్స్ పిక్చర్స్ నిర్మించనున్న కొత్త చిత్రానికి, కె. రాఘవేంద్రరావుగారిని దర్శకుడుగా, మురళీమోహన్‌గారిని కథానాయకుడుగా ఎంపిక చేసినట్లు వార్త.

సెప్టెంబర్ నుంచి షూటింగు వుంటుందని తెలుస్తూంది.

### ప్రత్యగాత్మ కొత్త చిత్రం

నిర్మాత కొసరాజు భానుప్రసాద్‌గారు ప్రముఖ రచయిత్రి యద్దనపూడి సులోచనారాణిగారి కథను చలనచిత్రంగా తీయడానికి నిర్ణయించారు. ప్రత్యగాత్మగారి దర్శకత్వంలో రానున్న ఆ చిత్రానికి మురళీమోహన్ నాయకుడు.

### త్రిలోక్‌చందర్ చిత్రంలో మురళీమోహన్

"భద్రకాళి" చిత్రం విడుదలయిన తరువాత, ప్రముఖ తమిళ దర్శకుడు త్రిలోక్‌చందర్‌గారు మరో పటిష్టమైన కథాబలం వున్న చిత్రాన్ని తెలుగులో తీయడానికి నిర్ణయించారు.

ఒకప్పుడు శివాజీ నటించిన హిట్ చిత్రం "ఇరుమలర్‌గళ్" చిత్రాన్ని మురళీతో నిర్మించడానికి నిర్ణయించారు.

పద్మిని పాత్రకు ప్రభను, కె. ఆర్. విజయ పాత్రకు జయప్రదను పెట్టగలరని తెలుస్తూంది.

తమిళ చిత్రం ఆరోజుల్లో సూపర్‌హిట్‌గా ప్రజలచేత అంగీకరించబడింది.

# ఇప్పుడు మీరు అతని పళ్లను పిప్పిపళ్లు కాకుండా చెయ్యవచ్చును.

## వాడండి సిగ్నల్ 2

**పళ్లను గట్టిపరచి దంత క్షయాన్ని నివారించేందుకు దీనిలో అత్యంత ప్రభావంగల ఫ్లోరైడ్ ఫార్ములా ఉంది.**




పంటినొప్పివల్ల కలిగేది కేవలం బాధ మాత్రమే కాదు దంతక్షయానికి అది సంకేతం కూడా. అశ్రద్ధ చేస్తే దంతక్షయం మరింతగా పెరిగి పిప్పి పళ్ళు అయిపోతాయి




నోటిలో ఉండే ఆమ్లాలు పళ్లలోకి చొచ్చుకుపోయి దంతక్షయాన్ని కలిగించకుండా మామూలు టూత్ పేస్టు ఆపలేవు




సిగ్నల్ 2లో అత్యంత ప్రభావంగల ఫ్లోరైడ్ ఫార్ములా ఉంది ఇది నోటిలోని ఆమ్లాలు పళ్లలోకి చొచ్చుకుపోయి దంతక్షయం కలిగించకుండా అరికడుతుంది

### పిప్పి పళ్లను నిరోధించే టూత్ పేస్ట్

పరిస్థితి విషమించక ముందే మీ కుటుంబంలో వారంతా వాడండి సిగ్నల్ 2— దంతక్షయాన్ని నిరోధించడంలో నిరూపించబడిన టూత్ పేస్ట్. దీనిలోని ప్రత్యేకమైన ఫ్లోరైడ్ ఫార్ములా పళ్లతో కలిసి వాటిని గట్టిపరుస్తుంది, పళ్లకు హాని కలిగించే నోటి ఆమ్లాలను నిరోధించేందుకు మరింత శక్తి నిస్తుంది— పిప్పి పళ్ళు కాకుండా కాపాడుతుంది. దంతక్షయాన్ని అరికట్టడంలో దీనికి మించిన టూత్ పేస్ట్ లేదు. మేం చెప్పిందే మీరు నమ్మక్కర్లేదు, మీ దంత వైద్యుని కూడా అడగండి.

## సిగ్నల్ 2 ఫ్లోరైడ్‌తో



కుటుంబంలో వారికి పిప్పి పళ్లు రాకుండా నిరోధిస్తుంది.

హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

లింటాస్-SG 2-1-223 TL



చిత్రానికి కొమ్మినేని కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం సమకూర్చగా జంధ్యాల, చక్రవర్తి, దేవరాజ్, రంగారావు కందస్వామి వరుసగా మాటలు సంగీతం, కెమెరా, కళ, కూర్పు సరఫరా చేస్తున్నారు

అల్లురామలింగయ్య, మాడా, సాక్షిరంగారావు, అనిత ఈ చిత్రంలోని కామెడీ ట్రాక్‌ను బలేతమాషాగా నటించారు శృంగార విభాగాన్ని జయమాలిని, విజయలక్ష్మి పూర్తి చేసారు శోకరసాన్ని ప్రభ, రమాప్రభ భర్తీచేసారు జి సత్యనారాయణరావు, వై శేషగిరిరావు సహనిర్మాతలుగా వ్యవహరించే యీ చిత్రానికి తారకరామా, శ్రీ తారకరామా, నవభారత్ పంపిణీదారులు

### రామానాయుడు పథకాలు

భాగ్యనగరంలో రెండు చిత్రాల నిర్మాణంలో నిమగ్నమై వున్న సురేష్ అధినేతను హైద్రాబాదులో సంవత్సరానికి ఒక చిత్రం తీసే వుద్దేశ్యం వున్నట్టు, యిటీవల ''మొరటోడు'' సెట్లో వెల్లడించారు

కొత్త దర్శకుడు నాగేష్‌గారిని 'జీనియస్'' అంటూ, రామానాయుడుగారు ప్రశంసించారు ''మొరటోడు'' చిత్రాన్ని అన్ని భాషలలో నిర్మించే

## సినిమా

అభిప్రాయం తనకు వున్నట్టు ఆయన చెప్పారు

హిందీ, తమిళ భాషల్లో కూడా ('మొరటోడు') జయసుధనే నాయికగా పెట్టదలచినట్టు, సురేష్ అధినేత చెప్పారు

''నటసామ్రాట్'' నటిస్తున్న ''చిలిపి కృష్ణుడు' చిత్రంపై ఆయనకు గట్టినమ్మకం వుండడంవల్ల ఆ చిత్రాన్ని కూడా తమిళ హిందీ భాషల్లో నిర్మించడానికి నిర్ణయించారు

### కథకుడు వ్రాసిన గీతాలు

నాటక రచయితగా, కథారచయితగా, మాటల రచయితగా దాసం గోపాలకృష్ణగారికి పేరుంది ఆయన వ్రాసిన పాపులర్ నాటకం ''చిల్లరకొట్టు చిట్టెమ్మ''ను పాపులర్ డైరెక్టర్ శ్రీ దాసరి వర్ణచిత్రంగా రూపొందించారు

ఆ చిత్రానికి మాటల రచయితగానేగాక, పాటలు వ్రాసే బాధ్యతను కూడా అగ్రదర్శకుడు దాసరిగారు, దాసంకు అప్పగించారు

శ్రీ దాసం వ్రాసిన మూడు + ఒకటి నాలుగు పాటలు, శ్రోతలను బాగా ఆకర్షించినట్టు, గ్రామఫోను కంపెనీవారు అధికార వార్తను అందచేశారు ఆ పాటలకు సంబంధించిన ''పల్లవి''ని పాఠకులకు తెలుపుతున్నాము

'మనుషులు చేసిన దొంగలు'

ఒకటి సువ్వీ కస్తూరి రంగ
సువ్వీ కావేటి రంగ

రెండు చీటికి మాటికి చిట్టెమ్మంటే
చీపురు దెబ్బలు తింటావ్‌రో

మూడు ఏంటబ్బాయా ఇదేంటబ్బాయా
నా దుంపతెంచావు నా కొంపముంచావు

నాలుగు మూడు పిన్నమా పాడు పిల్లోడు
పైన పైన పడతపంటడు

పైన పేర్కొన్న పాటలకు, రమేష్‌నాయుడు సమకూర్చిన జానపద సంగీతం, శ్రోతలను ఎంతగానో ఆకట్టుకున్న నిజాన్ని, అనేకచోట్ల నుంచి ఉత్తరాలు చెప్పారు

'నేను దర్శకుడు దాసరిగారికి ఎంతో ఋణపడివున్నాను ప్రజలు మెచ్చిన చిట్టెమ్మ నాటకం, దాసరిగారి రూపకల్పనలో మధుర మనోహరంగా వచ్చింది నా కల నిజం చేసిన దర్శక శ్రేష్ఠుడికి పత్రికాముఖంగా కృతజ్ఞతలు తెలపడం తప్ప మరేమి చెయ్యగలవాడను'' అన్నారు శ్రీ దాసం గోపాలకృష్ణ

—శ్రీనివాస్ ★

''జానక్కి ఏమీ కాలేదుకదా ?'' అదుర్దాగా ప్రశ్నించాడు భార్య కన్నీళ్ళు చూసి

పార్వతమ్మ జవాబు చెప్పాలనుకుని అంతలోనే ఏదో గుర్తువచ్చినట్లుగా ఉలిక్కిపడి తలెత్తి ఎదురుగా నిలబడివున్న అమ్మాయివంక చూసి ఆ తరువాత రంగన్నను పిలిచి—

''రంగన్నా! దక్షిణపు గదిలోకి ఈ అమ్మాయిని తీసుకెళ్ళు! ఆ బట్టలపెట్టె పుస్తకాలపెట్టె కూడా అక్కడే పెట్టు!'' అని ఆ అమ్మాయివంక చూస్తూ—

''నువ్వా గదిలో వుండు విజయా! యిక యించి ఆ గది నీదే! వెళ్ళు!'' అంది భారంగా! విజయ యింకేమీ మాట్లాడకుండా తడి అయిన కళ్ళను పమిటిచెంగుతో తుడుచుకుంటూ తల వంచుకుని రంగన్న వెనుకనే గదిలోకి వెళ్ళిపోయింది వెళ్ళుతున్న విజయను పరిశీలనగా చూశాడు రామనాథం

'విజయ! పేరుకి తగినట్టుగా లక్షణంగా వుంది అమ్మాయి కొనదేలిన ఆ ముక్కు! చారడేసి కళ్ళు! ఛాయ తక్కువ అయినా కళ అయిన ముఖం అచ్చు గోపాలం పోలికే! తండ్రి పోలిక ఆడపిల్లకి వస్తే అదృష్టవంతురాలంటారు అలాంటి అదృష్టం విజయ ముఖంలో రామనాథానికి స్పష్టంగా కనిపించింది విజయ గోపాలం బిడ్డే అని భార్య చెప్పకముందే గ్రహించాడు గోపాలం విజయకి పది సంవత్సరాల వయస్సప్పుడే పోయాడు మరి జానకి ఏమయింది? విజయని యిక్కడికి తీసుకురావటంలో గల భార్య అంతర్యం అర్థం కాక దగ్గిరకెళ్ళాడు

''జానకి ఆరోగ్యం ఎలా వున్నదని అడిగితే జవాబు చెప్పవేమిటి?'' నెమ్మదిగా అడిగాడు

''విజయ యిక్కడ వుండటంవల్ల చెప్పలేక పోయాను విజయకి తల్లి గుర్తు వస్తే ఆ దుఃఖాన్ని చూడలేను యింకెక్కడి వదినండీ! నేను వెళ్ళేసరికే లవసాన దశలో వున్నది విజయని నా చేతిలో వుంచి కన్ను మూసింది!'' కళ్ళనిండా నిండుకున్న నీళ్ళను పమిటిచెంగుతో తుడుచుకుంటూ అంది

''మరి నాకెందుకు కబురు చెయ్యలేదు పార్వతీ??''

''నేను వెళ్ళినందుకే ఊరు ఊరంతా విరగబడి చూశారు రోజూ వచ్చే పెద్దన్నయ్య పెద్ద వదిన నేను వెళ్ళిన తరువాత రావటమే మానివేశారు నేనేదో అంటరానిదాని నయినట్లుగా చూశారు వదిన చనిపోయిన తరువాత బైటనే వుండి అన్ని పనులూ నిర్వర్తించాడుగాని పలుకరించలేదు పెద్దన్నయ్య జానకి వదినకు నేనంటే వున్న ప్రేమాభిమానాలవల్ల అడను గుర్తుపెట్టుకుని విజయచేత పెట్రాగాం యిప్పించిందిగాని, నేను ఎవరో విజయకి కూడా ఆ యింటికి వెళ్ళేవరకూ తెలియదు ఆ సమయంలో మీరు వచ్చారంటే ఎంత రగడ చేసేవాడో జగన్నాథం అన్నయ్య నాకు తెలుసు అసలే పెద్దన్నకు ముక్కుమీదనే వుంటుంది కోపం మీకు కబురు వేయనిదే అందుకు!'' కళ్ళు తుడుచుకుంటూ జవాబిచ్చింది పార్వతమ్మ






రామనాథం ఎంతో బాధపడ్డాడు జానకిని చివరిసారయినా చూడలేకపోయినందుకు! తాను ఈ రోజున లక్షలకి అధిపతి పెద్ద బిజినెస్ మాగ్నెట్, యింకా అనేక ప్రముఖ వ్యాపార సంస్థల్లో షేర్లు వున్నాయంటే అవన్నీ పార్వతమ్మ చలువేనని, ఆ కృతజ్ఞతా భావం రామనాథం నరనరానా జీర్ణించుకునిపోయింది

''నా జీవితానికి వెలుగు నింపిన జానకి వదిన మాట తీసివెయ్యలేక విజయను నా గుండెల్లో భద్రంగా దాచుకుంటానని మరణ సమయంలో వున్న వదినకు మాట యిచ్చాను వదిన కోరిక కూడా అదే! నా దగ్గిరవుంటే విజయను చదివించి దానికొక ఆధారం చూపించుతానని వదిన నమ్మకం ఆ నమ్మకంతోనే విజయను నాకు అప్పగించింది వదిన ఋణం తీర్చుకొనుటకు నా కింతకంటే మరో మార్గం కనిపించలేదు!''

''విజయ భారం వహించుతానని జానక్కి మాట యివ్వటంలో నువ్వు పొరపాటు పడ్డావు, చాలా తప్పుకూడా చేశావు పార్వతీ?'' రామనాథం స్థిర గంభీర స్వరంతో అన్నాడు

''నాలుగు గోడలమధ్యా చీకటిలో కుమిలి పోతున్న నాకు తన సర్వస్వాన్నీ అర్పించి, ఎలాంటి నిందలకయినా ఓర్చి నా చీకటి బ్రతుక్కి వెలుగు చూపించిన వదినకు మాట యివ్వటంలో పొరపాటు పడ్డానని, విజయని తీసుకురావటంలో తప్పు చేశానని మీరంటున్నారా?? మీరేనా అనేదసలు?'' పార్వతమ్మ కంఠం తీవ్రస్థాయి నందుకున్నది కోపంతో,

''అదికాదు పార్వతీ? ''

''మీరేమీ చెప్పనవసరంలేదు మీ తేలికబుద్ధి చూపించుకున్నారు మీరెలా నన్ను అర్థం చేసుకున్నా నేనేమీ బాధపడను! విజయ యిక్కడ వుండితీరుతుంది దాని భారం నేను వహించుతాను అదిమాత్రం ఖాయం!''

''ఆవేశంలో నిన్ను నీవే మర్చిపోతున్నావు పార్వతీ! నీ రాబందులాంటి ముద్దులకొడుకు ముందు విజయను తీర్చిదిద్దలేవు! కనీసం గది దాటి చిలుకలతో కలిసిమెలిసి వుండే అలవాటు నీ పెద్ద కోడలు సుందరికి లేదు పెద్దకొడుకు భాస్కర్ వున్నాడంటే వాడి ఆఫీసు విషయాలు తప్పితే మరో సంగతి వాడి బుర్రకి ఎక్కదు ఎంత దుడుకు స్వభావమో శ్రీనివాస్‌ది నీకు తెలియనిది కాదు ఏ మహిళామండలి మీటింగ్ జరిగినా, ఎక్కడ అగ్నిప్రమాదం జరిగినా నువ్వు వెళ్ళిపోతు వుంటావు! నేనా వ్యాపారం అనుకుంటూ ఆఫీసు పట్టుకుని ఉదయం నుంచి సాయంత్రం వరకూ అంటిపెట్టుకుని వుంటాను! ఇన్ని రకాల మనస్తత్వాల మధ్య అర్థం చేసుకుని ఆ అమ్మాయి తట్టుకు వుండగలదా అని నా సందేహం!''

''అదా మీ భయం? యింకేమిటో అని భయపడ్డాను అలాంటి లోపం రాకుండా చూసుకునే బాధ్యత నాదండీ?? ''

''అదికాదు పార్వతీ? చెప్పటం సులభమే! ఆచరణలోకి వచ్చేసరికి చాలా కష్టం విజయని హాస్టల్లో వుంచి చదివించటం మంచిదని, అది కూడా యిక్కడ కాకుండా మరో ఊరిలో అయితే యింకా బాగుంటుందని, విజయ క్రింద ఎంత డబ్బు ఖర్చయినా వెనుకంజ వేయను నా మాట విను! ''

''నేనేదో పరాయిదాన్ని నయినట్లుగా మాట్లాడుతున్నారేమిటండీ? మీరిలాంటి శంకలేమీ పెట్టుకోకండి! విజయని పరాయిచోట వుంచే ఉద్యాధర్మంగా యింత యిష్టపడేదేకంటే? దగ్గిర వుంచుకుని భవిష్యత్తుని తీర్చిదిద్దటంలో జానకి వదిన మనకు చేసిన సహాయానికి ప్రతిఫలం చూపించినట్లుంటుందని నా అభిప్రాయం!''

''సరే! నీ యిష్టం పార్వతీ? కానీ ఒక్క విషయం మాత్రం గుర్తుంచుకో!''

''ఏమిటండీ ఆ విషయం?'' ఆసక్తిగా అడిగింది

''మరణ సమయంలో జానక్కి నువ్విచ్చిన మాటను మర్చిపోకుండా తల్లినీ తండ్రినీ కోల్పోయిన విజయకు నీ నీడలో వాళ్ళిద్దరూ గుర్తు రాకుండాను, ఎట్టి పరిస్థితిలోనూ బైటకి అడుగు పెట్టే అవకాశం కల్పించకు అప్పుడే నువ్వు జానక్కి యిచ్చిన మాట నిలబెట్టుకున్నట్లు అవుతుంది!''

''మీరు హితబోధ చేస్తున్నారుగాని అవన్నీ నాకు తెలియనివి కాదుగాని!'' అంటూ తేలికగా భర్త మాటను కొట్టివేసింది

రామనాథం గంభీరమయిన వాక్కులు గదిలో వున్న విజయకి స్పష్టంగా వినిపించాయి భారీ విగ్రహం! విగ్రహానికి తగ్గ గంభీరత! తల్లి చెప్పగా విన్నది ఇప్పుడు మనిషిని చూసి వెయ్యేళ్ళ్తి

## టాకీ

• లక్ష్మి ఫిలింస్ కంబైన్స్ వారి వర్ణ చిత్రానికి "నా ప్రాణంలో ప్రాణం" అని పేరు పెట్టారు శోభన్‌బాబుగారి ద్విపాత్రాభినయం ప్రత్యేక ఆకర్షణగా గల ఈ రంగుల చిత్రాన్ని ఎన్ ఆర్ అనురాధాదేవి నిర్మిస్తున్నారు శ్రీ ఎస్ డి లాల్ శోభన్ కలిసి పని చేస్తున్న మొదటి చిత్రం యిది

★ నవత చిత్ర వారి "పంతులమ్మ" వర్ణ చిత్రానికి కన్నడ ప్రముఖులు రాజన్ నాగేంద్ర సంగీత దర్శకులుగా పని చేస్తున్నారు "ఉత్తమనటి" లక్ష్మి టైటిల్ పాత్రను పోషిస్తున్న ఈ చిత్రానికి సింగీతం శ్రీనివాసరావు దర్శకుడు ఎన్ కృష్ణంరాజుగారు ఈ చిత్రం ద్వారా వెంకట్రామయ్యగారిని రచయితగా పరిచయం చేస్తున్నారు

★ అన్నపూర్ణా స్టుడియోస్‌లో ఆగస్టు 26న ఎడిటింగు రూములో విజయ మాధవీ పిక్చర్స్‌వారి కూర్పు పని ప్రారంభమైంది. జి జి కృష్ణారావు ఎడిటర్ అదే రోజున రామానాయుడుగారి "విలిపి కృష్ణుడు" చిత్రానికి మొదటి ఫ్లోర్‌లో ప్రారంభ వుత్సవం జరిగింది శ్రీ నాగిరెడ్డిగారి కుమారులు శ్రీ వేణుగోపాల్ రెడ్డి, శ్రీ రామానాయుడుగారి అబ్బాయి సురేష్‌బాబు స్విచ్ ఆన్ క్లాప్ కార్యక్రమాన్ని చేశారు

★ సారధి స్టుడియోస్‌లో నిర్మాతల సౌకర్యార్థం అయిదు కాటేజెస్ నిర్మించడానికి నిర్ణయించినట్టు, శ్రీ చంద్రశేఖరరావుగారి అబ్బాయి శ్రీ ప్రభాత్ చెప్పారు

★ ప్రతాప్ ఆర్ట్స్ ప్రొడక్షన్స్, తమిళ రచయిత గుహనాధన్‌గారి దర్శకత్వంలో, సారథీ స్టుడియోస్‌లో నిర్మిస్తున్న చిత్రానికి "సూర్య చంద్రులు" అని పేరు పెట్టారు ఈ చిత్రంలో విజయనిర్మల, సత్యనారాయణ, లత, చంద్రమోహన్, గుమ్మడి, రావు గోపాలరావు, ప్రవీణ ప్రధాన పాత్రధారులు కె రాఘవ నిర్మాత.

నమస్కరించాలన్న పూజ్యభావం కలిగింది విజయకి గదిని నలువైపులా కలియచూసి చాలా విశాలంగా వున్నది! అనుకుంది

"మరీ ఎండనుపడి వచ్చారు స్నానాలవీ కానిచ్చి భోజనాలు చేయండి విజయకి యిక్కడంతా కొత్తకదా? కొంచెం ఆ అమ్మాయి సంగతి కూడా చూస్తూవుండు!" అన్నాడు రామనాథం

"అలాగేలెండి!"

అంటూ లోపలికి వెళ్ళింది పార్వతమ్మ విజయ గదిలోనుంచి మేనత్త పిలుపుతో యివతలకి వచ్చి వెనుకనే వెళ్ళింది రంగన్న డైనింగ్ రూం శుభ్రం చేస్తున్నాడు

"ఏమయింది రంగన్నా?" అర్థంకాక అడిగింది పార్వతమ్మ

"చినబాబుగారు!" యింక ఆపైన చెప్పలేకపోయాడు

"నీ సుపుత్రుడు చేసిన ఘనకార్యం! పాపం! కష్టపడి ఊరుమీద బలాదూరు తిరిగి వచ్చేసరికి అన్నీ పదార్థాలూ వేడిగా లేవని విసురుపెట్టి ఇల్లంతా జిమ్మాడు!" కోపంగా అన్నాడు రామనాథం

భర్త చెప్పిన మాటకి ఏం జవాబు చెప్పలేక పోయింది పార్వతమ్మ తను లేకపోతే శ్రీనివాస్ ఎంత అల్లరి ఆగడం చేస్తాడో పార్వతమ్మకి తెలుసు! విజయ కిదేమీ అర్థంకాలేదు మామయ్యేమో సుపుత్రుడు అంటున్నారు ఇంతకీ ఆ సుపుత్రుడు చిన్నవాడా పెద్దవాడా? పెద్దవాళ్లయితే ఇలా ఎందుకు చేస్తాడు? అరూ, పది సంవత్సరాల వయస్సు పిల్లలే ఇలాంటివి చేస్తారు! అనుకుంది విజయ

సీతాలు విజయకి బాత్‌రూం చూపించి తిరిగి వెళ్ళిపోయింది

విజయ స్నానంచేసి వచ్చేసరికి డైనింగ్ టేబుల్‌మీద ప్లేటులునిండా వివిధ పదార్థాలు వడ్డించబడి వున్నాయి చేతులు కట్టుకుని దూరంగా రంగన్న నిలబడి వున్నాడు విజయకి చామింటిలో పద్ధతికి ఈ యింటిలోని పద్ధతులకి చాలా తేడా కనిపించింది అక్కడ అన్ని పనులూ స్వయంగా చేసుకోవలసివచ్చేది ఉసూరుమంటూ

## రాగబంధం

స్కూలు నుంచి ఇంటికి వచ్చిన తరువాత తల్లితోపాటు తనూ ఇంటి పని, తోట పనీ చేసేది పెరటిలో కూరలు పండించుకుని వాటితోనే ఎక్కువకాలం గడిపేవారు ఇక్కడ అలాకాదు! ప్రతీ పనికీ నౌకర్లు వున్నారు మేనత్త ఇంత వున్నతంగా వుండటానికి కారణం ఏమిటి? ఆ ఇంటి ఆడబడుచేగా? ఇంటి కోడలిగా తన తల్లి పేదరికం అనుభవించటానికి కారణం? మేనత్త యెంత ఖరీదుగల జీవితం అనుభవించుతున్నదో? ఆ ఇంటిలోకి అడుగు పెట్టిన రెండు గంటలలోనే విజయ గ్రహించింది భోజనం పూర్తిచేసుకుని తన గదిలోకి వెళ్లబోతూ హాలులోకి చూసింది

'నీ సుపుత్రుడు!'

అని రామనాథం అన్న మాటలు గుర్తు పెట్టుకుంది ఆ సుపుత్రుడు ఎవరు? అన్న ఆసక్తి, ఎలా వుంటాడో చూడాలన్న కోరికా కలిగింది విజయకి

శ్రీనివాస్ తన గది తలుపులు బిగించుకుని పడుకున్నట్టు విజయకేం తెలుసు? హాలులో యెవరూ కనిపించకపోయేసరికి తన గదిలోకి వచ్చి ఫోం బెడ్ మీద పడుకోగానె వారంరోజుల నుంచి అలిసిపోయిన మనసు, శరీరం విశ్రాంతి తీసుకో సాగింది మరో పది నిముషాలలో ఆదమర్చి నిద్రపోయింది

## 2

ఆఫీసు నుంచి భోజనానికి తన స్కూటర్ మీద వచ్చిన భాస్కర్‌కి తల్లిని చూడగానే ముఖం విప్పారింది

"ఇన్నిరోజులు వున్నావేమిటమ్మా?" అనడిగాడు

"ప్రయాణం అన్న తరువాత అంతేకదా? నాలుగురోజులు వెనుక ముందు అవుతుంది రా! వడ్డించుతాను!" అంది

సాధారణంగా పార్వతమ్మ ఇంట్లో వుంటే భర్తకి పిల్లలకు తనే స్వయంగా వడ్డించుతుంది అలా వడ్డించుతూ వాళ్ళతో కబుర్లాడటం ఆమెకు అలవాటు మరీ రహస్యాలయితే నౌకర్లులేని సమయం, రాత్రిళ్లు మాత్రమే! అప్పుడే మాట్లాడుకుంటారు

"మీ ఆడవాళ్ళు ఏ వూరు వెళ్ళినా ముందుకి రోజులు దొర్లటం తప్పితే వెనక్కి మాత్రం జరగదమ్మా! ఆఁ ఇంతకీ పెదమామయ్య, వాళ్ళ కుటుంబ సభ్యులు, చిన్నత్తయ్య బాగున్నారు కదూ?" వడ్డించిన ప్లేటుని దగ్గరకు లాక్కుంటూ అడిగాడు

"అందరూ బాగున్నారుగాని మీ చిన్నత్తయ్యని ఇంకెప్పటికీ చూడలేము"

"అంటే?"

"చనిపోయింది! ఖర్మ అయ్యేవరకూ వుండవలసివచ్చింది!" జానకి చనిపోయినదన్న మాట చెప్పగానే పార్వతమ్మ కళ్ళు అశ్రుపూరితాలై పోతున్నవి వారిద్దరి మధ్యా వున్న అనుబంధం అలాంటిది

"ఓ పాప వుండేదనుకుంటానమ్మా?"

"ఉండేది ఇప్పుడు పాపగాలేదు పదహారేళ్ళ వయస్సు వచ్చింది పేరు విజయ అచ్చు మా అన్నయ్యగానే వుంటుంది చనిపోతూ మీ అత్తయ్య విజయ బాధ్యత నా కప్పగించింది జీవితంలో మరువరాని సహాయం నాకు చేసింది మీ అత్తయ్య కాదనలేకపోయాను!" కళ్ళు వత్తుకుంటూ అంది

"సహాయం చేస్తేనే చెయ్యాలని లేదుగా అమ్మా! మానవత్వపు విలువలతో చేయవచ్చును ఎలాగూ నీకు ఆడపిల్లలూ లేరు విజయ ఈ యింటిలో కళకళలాడుతూ తిరుగుతుంటే లోటుబట్టువులు లేని కొరత మాకూ తీరినట్లుంటుంది!"

"విజయని ఇక్కడకు తీసుకురావటంలో నేనేదో పెద్ద పొరపాటు చేశానని మీ నాన్నగారు అంటున్నారు!"

భాస్కర్ చాలాసేపు ఆలోచించి చివరి కన్నాడు — "నాన్నగారు అన్నది సమంజసంగ నే వుందమ్మా! నాన్నగారు ఏది మాట్లాడినా దూరంగా ఆలోచించే మాట్లాడతారని, కీడెంచి మేలు ఎంచటం వారి అభిమతం!"

"నువ్వూ అలాగే అంటున్నావన్నమాట?" పార్వతమ్మ కంఠంలో కోపం ధ్వనించింది

భాస్కర్‌కి తల్లిని కాదని వాదించటం కష్టమైపోయింది [ఇంకా వుంది]

# మూషిక మైతిమి అమ్మో అమ్మో!

కల్తీ! కల్తీ! ఒకటే కల్తీ! దేంట్లో చూసినా కల్తీ! బియ్యం కొందామని షాపుకెళితే బియ్యంలో కల్తీ మానె కొందామని అంగటి కెళితే అందులో కల్తీ బెల్లంలో కల్తీ చక్కెరలో కల్తీ ఇలా వుంటే యిక నీకు వుండ్రాళ్లు చేసి పెట్టమంటే ఎలా? ఈ కల్తీ మొదలయ్యేసరికి రోడ్డుమీద గులకరాళ్లు కన్పించడంకూడా అరుదై పోయింది ఉండ్రాళ్లు ఎలాగూ పెట్టలేంగదా కనీసం ఇడ్లీలైనా పెడ్దామని హోటల్ కెళితే ఓ నాలుగిడ్లీలు ప్లేటులో తీసుకొచ్చాడు నాకేమో ప్లేట్లో సాంబార్ మాత్రమే కన్పించేసరికి ఇడ్లీ లెక్కడయ్యా అని సర్వర్ని అడిగాను పావలా బిళ్ళలా అలా పైన తేలుతుంటే కన్పించడంలే అని నన్నే డబాయించాడు కంటికి దగ్గరగా తీసుకెళ్లి ఎక్కడుందో చూచేసరికి వుసుక్కున ముక్కులోకి దూరింది అసపబద్దాలా ఇడ్లీ ఇడ్లీ ఏం కర్మ? ఏడుకొండలవాడి లడ్డూకూడా బందరులడ్డూలా ఉసిరిక్కాయంత అయిందివుడు వింటున్నావా! నే చెప్పేదంతా! దేవుడు వరమిచ్చినా పూజారి వరమివ్వడు అన్నట్టు ప్రభుత్వం గ్రాంట్ చేసినా వ్యాపారులు ఇంప్లిమెంట్ (అమలు) చేసిచస్తేగా పరిస్థితులిలా వుంటే నీకు వుండ్రాళ్లు ఎక్కడ్నుంచి తెచ్చేది కాసిన్ని పాలకాయలు పెడ్తాను ఈసారికి సర్దుకో నీ దయవల్ల ధరలు వరలు సర్దుకుపోతే కొబ్బరి కాయంత వుండ్రాళ్లు చేసిపెడ్తాను ఈసారికి మాత్రం ఏమనుకోకు ఈ కల్తీ ఆహారం తిని




గణపతితో సూర్యకాంతం

తిని ఏనుగుల్లా వుండాల్సినవాళ్లం ఎలికల్లా తయరయ్యాం మన్వేదో పాపం ఆరోగ్యంగా వున్నట్టున్నావ్! ఈ కల్తీ ఎందుకు తింటావ్! అందుకే వుండ్రాళ్లను అనాయిడ్ చేసి పాలకాయలు పెడ్తున్నాను మూషిక వాహనా నమో నమో! అనాస్పందిపోయి మూషికమైతిమి అమ్మో! అమ్మో! అనే పరిస్థితి ఏర్పడింది మాకు ఈ పాలకాయలే పెద్ద సైజు కొబ్బరికాయనుకో ఇదే పాలల్లో వుండ్రాళ్లనుకో

ఏమయ్యో! గణపయ్యా! ఏంటి? నువ్వింకా నీ తలిదండ్రులతో వెండికొండ మీదున్నట్టే అనుకుంటున్నావా! ఇది భువర లోకం కాదు భూలోకం ఇక్కడివాళ్ల అవస్థనుకూడా కాస్త కనిపెట్టు చేలగట్లల్లోనూ, చెరువు గట్లల్లోనూ నడిచి నడిచి ఆ పని తొందరలో నీ పూజ చేయడం మర్చిపోయారేమో మా సినిమావాళ్లు అందుకే పోయిన సంవత్సరం చిత్రాలన్నీ నత్త నడకే నడిచాయి అలా పోయి ఇలా హెడ్ ఆఫీస్ ఎక్కడుందో వెతుక్కుంటూ వచ్చేసాయి నువ్వు కాస్త నిద్రావస్థలో వున్నపుడు, ఓ అయిదో, ఆరో మాత్రం యమస్పీడ్‌గా కలెక్ట్ చేసేసాయి ఇదేవన్యాయమయ్యా! చిత్రానికి శ్రీకారం చుట్టే దగ్గర్నుంచి శ్రీ లక్ష్మీ గణపతే నమః అంటూ పూజ చేస్తారు మావాళ్లందరూ అలాంటివాళ్ల మీద నీ కెందుకింత నిర్దయ? మా సినిమా పరిశ్రమను కాపాడు మమ్మల్నందర్నీ దీవించు

ఓ సిద్ధివిఘ్నేశ్వరా! ప్రజలన్, పాత్రికేయులన్, ప్రొడ్యూసరులన్, దర్శకులన్, ఆర్టిస్టులన్, టెక్నీషియనులన్ నీ దివ్యహస్తంబుతో దీవించి, పాపములన్ బోగొట్టి, ఫలమున్ ప్రసాదింపుమా! ఓ దేవదేవా! ★

మూషిక మైతిమి అమ్మో అమ్మో!

## సినిమా సంగ్రహం

### రామకృష్ణకు కొత్త జీవితం

స్వర్గీయ ఘంటసాలవలె (70 శాతం) పాడగల గాయకుడుగా రామకృష్ణను ప్రేక్షకులు అంగీకరించారు

అన్నపూర్ణా ఆర్ట్ పిక్చర్స్‌వారి 'విచిత్ర బంధం'' చిత్రంలో ''చిక్కావు చేతిలో చిలకమ్మా'' అనెడి పాట పెద్దగా పాపులర్ అయ్యింది

తరువాత నాగేశ్వరరావుగారికి, రామకృష్ణ వాయిస్ కరెక్ట్ అని నిర్మాతలు సంగీత దర్శకులు అంగీకరించి, అతనిచేత పాడించారు

కాలదోష ప్రభావ ఫలితంగా, పాపం, రామకృష్ణచేత ఎవరూ పాడించడంలేదు

దేవీ ఆర్ట్ ప్రొడక్షన్స్ రంగుల్లో నిర్మిస్తున్న ''దేవదాసు మళ్లీ పుట్టాడు'' చిత్రంలో, అగ్ర దర్శకుడు దాసరి, అన్ని పాటలను రామకృష్ణకు యివ్వడానికి ముందడుగు వేశారు

ఆగస్టు 16న, ప్రసాద్ థియేటర్లో 'దేవదాసు మళ్లీ పుట్టాడు'' చిత్రానికిగాను, నారాయణరెడ్డిగారు వ్రాసిన నిషా పాటను, రాజేశ్వరరావుగారు ధ్వని ముద్రణ చేశారు

''ఎవరికి ఎవరు చివరికి ఎవరు
ముగియని ఈ యాత్రలోన
ముగిసే ఈ జన్మలోన''

అనెడి పాటను రామకృష్ణ ఎంత గొప్పగా పాడారో తెలుసా?

ఘంటసాలగారు బ్రతికుంటే, ఆమాంతం రామకృష్ణను కౌగిలించుకునేవారు

అందరినీ ఆశ్చర్యపరిచాడు రామకృష్ణ దాసరిగారి ఆనందానికి అవధులు లేవు

రామకృష్ణను ప్రోత్సహించినందుకు, ''నటసామ్రాట్'' దాసరిగారిని, నిర్మాతలు శ్రీనివాసులు - పాండురంగప్పలను అభినందించారు

### పుట్టినరోజున ప్రారంభం

అక్కినేనిపుట్టిన సెప్టెంబర్ 20వ రోజున, దేవీ ఆర్ట్ ప్రొడక్షన్స్ అధినేతలు ''దేవదాసు మళ్లీ పుట్టాడు'' వర్ణ చిత్రాన్ని ప్రారంభిస్తున్నారు

ఈ సంచలనాత్మక చిత్రంతో అక్కినేని వాణిశ్రీ జానకి సావిత్రి అల్లురామలింగయ్య ముఖ్య పాత్రధారులు

అక్కినేని చిత్రానికి కె ఎస్ మణి, (ఛాయాగ్రహణం) బాబు, (కూర్పు) భాస్కరరాజా, (కళ) మోహన్‌జీ (స్టిల్సు) పని చెయ్యడం ఈ చిత్రంతోటే ప్రారంభం

డిశంబర్‌లో జరిగే షెడ్యూలుతో ''దేవదాసు'' చిత్ర నిర్మాణం పూర్తవుతుంది, అన్నారు ప్రజాదర్శకుడు దాసరి

విఖ్యాత తమిళ సినిమా కవి 'వాలి'ని ఒక అభిమాని "మీరు యిచ్చిన పాటకు ట్యూన్ చేసుకోమంటారా? లేకపోతే ట్యూన్‌కోసం పాట రాస్తారా?" అని అడిగితే, "డబ్బుకోసం పాట రాస్తాను" అని వాలి ఛలోక్తిగా సమాధాన మిచ్చారట.

ఇలా చమత్కరించడంలో ప్రసిద్ధిపొందిన మరో తమిళ కవి స్వర్గీయ కొత్తమంగళం సుబ్బు. ఆయన ఒకప్పుడు జెమినీ సంస్థలో కథా విభాగానికి అధిపతి. ఒకసారి ఆయన తన అల్లుడి ఇంటినుంచి ఒక పాత ఫియట్ కారును పరధ్యానంగా డ్రయివ్ చేసుకొని వస్తూంటే, దారిలో ఒక ట్రాఫిక్ కానిస్టేబుల్ ఆపి, "మీరు చాలా ఓవర్ స్పీడ్‌గా కారును డ్రయివ్ చేసుకొని వస్తున్నందున కేస్ బుక్‌చేయవలసి వస్తోంది" అన్నాడు. దానికి సుబ్బు 'అలాగా! చాలా సంతోషం. దయచేసి వెంటనే ఛార్జ్‌షీట్‌ను యివ్వండి. దాన్ని ఇప్పుడే తీసుకెళ్లి మా అల్లుడికి చూపిస్తాను. అతనికి కానుకగా నేనిచ్చిన ఈ ఫియట్‌కారు యెక్కువ స్పీడ్ పోవడంలేదని అతను ఇందాక నిష్ఠూరమాడి, దీన్ని తీసుకెళ్లిపొమ్మన్నాడు నన్ను" అన్నారట. ఆ కానిస్టేబుల్ నవ్వుకొని, ఆయన సుబ్బు అని తెలిశాక "అరే! మీరా! మీ జోక్‌లు తరచు 'ఆనంద వికటన్' పత్రికలో చూస్తూంటానండి. నేను మీ ఫేన్‌ను. మీ పరిచయభాగ్యం లభించినందుకు యెంతో ఆనందంగా వుంది. మీరు వెళ్లొచ్చు, సార్!" అన్నాడట.

అలాగే తమిళ చిత్రాల పోస్టర్లు కూడా తరచు కాస్త తమాషాగా వుంటూంటాయి.



'ఇంద్రధనుస్సు'లో శారద

'మంత్రికుమారి'' అనే తమిళ చిత్రం చాలాకాలం క్రితం తయారైంది. దానికి రచయిత ఎం. కరుణానిధి. హీరో ఎం. జి. ఆర్. ఇటీవలే ఈ చిత్రం మళ్లీ విడుదలైంది. పోస్టర్లలో ఇలా వేశారు. "ఈ చిత్రానికి రచన మాజీ ముఖ్యమంత్రి. హీరో నేటి ముఖ్యమంత్రి."

సమయస్ఫూర్తితో ఇట్టే సమర్థించుకోగల ఒక తమిళ దర్శకుని ప్రస్తావన యిటీవల వచ్చినప్పుడు భానుమతి ఒక సంఘటన గురించి తెలియజేశారు.

ఎక్కువ దూరంలో ఔట్‌డోర్ షూటింగ్‌లకి పిల్వడానికి ఇష్టపడరు. కాని, ఆ తమిళ దర్శకుడు కాస్త చాదస్తంగల మనిషి. ఆమె ఒక చెరువు దగ్గర పాటపాడే సన్నివేశం చిత్రీకరించ... దానికి బెంగుళూరు దగ్గర ఒక చక్కని లొకేషన్ చూశాన్నాడు. "అంత దూరంలోని ఆ చెరువులోని విశేషమేమిటో!' అని భానుమతి అడక్కపోలేదు. అందుకా దర్శకుడు "ఒక చిన్న గుట్టలాంటి ప్రదేశంమీద కెమెరా వుంచి, లో ఆంగిల్‌లో తీయవలసిన షాట్ అది. బెంగళూరు దగ్గరున్న ఆ చెరువు పక్కనే ఒక చిన్న గుట్ట నేనూహించినట్లుగానే వుంది. అదే బాగుందని ఎన్నుకున్నాను' అన్నాడు.

ఆయన అంత శ్రద్ధగా ఆ షాట్ తీయాలను...ంటున్నప్పుడు కాదనడం యెందుకని భానుమతి ...రే అన్నారు.

ముందు కారులో నిర్మాత, దర్శకుడు, వెనుక కారులో భానుమతి బెంగుళూరు దిశగా ప్రయాణం సాగిస్తున్నారు.

కొంత దూరం వెళ్లాక ముందున్న కారు ఆగింది. డైరెక్టర్ దిగి కుడివైపుగా చూశాడు. కొంత దూరంలో ఒక చిన్న గుట్ట వుంది. దానికి అవల చెరువు కనిపిస్తోంది. డైరెక్టర్ తిన్నగా అటుకేసి నడిచివెళ్లి, ఆ గుట్ట ఎక్కి, అటు దిగి, కాస్సేపటికి తిరిగి వచ్చాడు పెదవివిరుస్తూ.

"ఏమైంది? ఎందుకు కారు ఆపారు?" అన్నారు భానుమతి.

"అబ్బే — ఏం లేదమ్మా. బెంగుళూరు దగ్గరున్న ఆ లొకేషన్‌కు అంత దూరం శ్రమపడి వెళ్లడ మెందుకని — ఈ చెరువు చూసి, కారు ఆపించా. తీరా అక్కడికి వెళ్లి చూస్తే, లొకేషన్ నేనూహించుకున్నట్లుగా లేదు" అంటూ డైరెక్టర్ కారు ఎక్కాడు.

కార్లు కదిలాయి. కొన్ని మైళ్ళు వెళ్లాక మరో చోట యింకో చెరువు దగ్గర గుట్ట కనిపిస్తే, ఆ డైరెక్టర్ మళ్లీ దిగివెళ్లి, ఆ గుట్ట ఎక్కి, అటు దిగివెళ్లి, కాస్సేపటికి తిరిగివచ్చి, యిందాకటిలాగే నిట్టూర్పు వదిలాడు.

ఇలా ఆయన బెంగుళూరు సమీపించేవరకు అయిదుసార్లు కారు దిగి వెళ్లొచ్చాడట.

"పాపం! మీ డైరెక్టరు ఎక్కువదూరం తీసుకెళ్లి అందర్నీ యిబ్బందిపెట్టడమెందుకని, దారి పొడుగునా మంచి లొకేషన్ కనిపిస్తుందేమోనని శ్రమతీసుకొని, ఎన్నోసార్లు కారు దిగి వెళ్లి చూసొచ్చారు" అని భానుమతి ఆ చిత్ర నిర్మాతతో అంటే, ఆయన "అమ్మా! అదికాదు అసలు విషయం. మా డైరెక్టర్‌గారికి ఉదయం

# రూ. 50 తక్కువ!

భారత దేశపు అత్యధికంగా
అమ్ముడవుతోన్న
రికార్డ్ ప్లేయర్ సరికొత్త
తక్కువ ధరకి లభిస్తోంది




## హెచ్ యమ్ వి
# ఫియస్టా పాప్యులర్

### అదే విశిష్ఠ రూపం

గట్టిగా, దిట్టంగా దీర్ఘకాలం మన్నటానికి నిర్మించబడిన హెచ్‌యమ్‌వి ఫియస్టా పాప్యులర్ ఆకర్షణీయమయిన ద్వివర్ణ క్యాబినెట్‌లో, వేలకొద్దీ గృహాలలో ప్రియమయినది కావడానికి కారణమయిన అదే అందమయిన రూపంలో వస్తోంది. ప్రతి సందర్భానికి బహుమతిగా ఇవ్వడానికి వీలుగా అలంకరించబడిన అట్టపెట్టెలో లభిస్తోంది.

### అదే విశిష్ఠ విధానం

అంతర్నిర్మితమయిన ఆంప్లిఫైయర్ మీకు కచ్చితమయిన విశిష్ఠ నాదాన్ని అందచేస్తుంది మూతలో వుంచబడిన శక్తివంతమయిన స్పీకర్ ఉత్తమమయిన రీతిలో వినడానికి మీరు కోరిన భంగిమలో అమర్చుకోవచ్చు తేలికగావున్న టోన్-ఆర్మ్ స్టైలస్ తరుగు నష్టములను అరికట్టుతుంది. సంగీత ప్రియులు విలువనిచ్చే విధానంలో ఇదంతా భాగమే!

### సరికొత్త తక్కువ ధర

ఉత్పత్తి పెరుగుదల ధరలు తగ్గడానికి తోడ్పడు తుంది—ఈ లాభం మేము మీకు అందచేస్తాం. ధరలు అంతటా పెరుగుతోన్న కాలంలో, మేము ఎక్కువగా ఉత్పత్తిచేస్తాం. కనుక మీరు తక్కువ చెల్లిస్తారు!

GC-9311

2,00,000 కి పైగా సంతృప్తి పొందిన
ఫియస్టా స్వంతదారులు!

మీ దగ్గరలోనున్న హెచ్‌యమ్‌వి డీలర్ వద్దకు
ఈ రోజునే వెళ్ళండి.




హిస్ మాస్టర్స్ వాయిస్
భవిష్యత్తు శబ్దము



# సీరియల్



(గత సంచిక తరువాయి)

"మాధవి విధవా !!!

ఆ మాటను నమ్మలేక పోతోంది వసంత.

బొట్టు లేనందువల్ల ఇప్పుడే స్నానంచేసి వచ్చిన అందమైన కన్నెపిల్లలా వుందేగాని విధవలా అనిపించటమే లేదు

వసంత కళ్లు నీటితో నిండిపోయాయి. కళ్లు తుడిచింది మాధవి

"స్కూల్లో చదువుకునే రోజుల్లో నిన్నెవరైనా ఏమైనా అంటే అపాలజీ కోరుకునే దాకా వూరుకునేదాన్ని కాదు. డ్రిల్ పీరియడ్‌లో నీ కాల్లో ముల్లు విరిగితే నీవు ఏడుస్తున్నా లెక్కచేయక పిన్‌తో కెలికివేసేదాన్ని. నీకు ఎలాంటి బాధ కలిగినా దాన్ని నివారించే ప్రయత్నం క్రియలో చూపేదాన్ని అదే నన్నెవరైనా ఏమైనా అన్నా, నాకేదైనా కష్టం కలిగినా నీవు బావురుమని ఏడ్చేసేదానివి. అంత అర్భకపు మనసుతో నా బాధను ఎలా తీర్చగలనని చెప్పించుకున్నావు చెప్పు?" నవ్వు తెచ్చి పెట్టుకుంటూ అడిగింది మాధవి.

వేలగా చూసింది వసంత.

"నాకు తెలుసు నీవా విషయాన్ని విని తట్టుకోలేవని తట్టుకున్నా ఏమీ చేయలేవని. చూడు, ఎలా జ్వరం తెచ్చుకున్నావో" మందలింపుగా అంది మాధవి.

"ఏమీ చేయలేకపోయినా నీ వంటే నేనే భయం. కరువుతీరా ఏడ్చి కాస్త ఉపశమనమైనా పొందుతావను. అగ్నిపర్వతంలా లోలోన రగులుతూ నిన్ను నీవు కాల్చుకుంటున్నావు. మనసులో సుడిగుండాల ఒత్తిడిని భరిస్తూ పైకి నిర్మలంగా నవ్వుతున్నావు. గండ శిలలను గుండెల్లో మోస్తూ ఆ బరువుకు కృంగిపోతున్నావు."

# శాంతి తీరం

చక్కిలం విజయలక్ష్మి

# కదలిసాగే ఉత్సాహానికి ప్రతిరూపం..

## బ్యాగ్‌పైపర్ విస్కీ

మృదువైనది. మురిపించేది.
మనసలరించేది. అధునాతనమైనది
దీని రుచి. దీనికిదే సాటి!

ఫలానాదే కావాలనుకునే వారి కోసం
ప్రత్యేకంగా రూపొందించబడింది.
దిగుమతి చేయబడిన మేలైన
స్కాచ్ మరియు వాసికెక్కిన
భారతీయ మాల్ట్ విస్కీలతో
తీరుగా మిశ్రమం చేయబడింది.
మ్యాక్డొవెల్ వారి డిస్టిలరీలో
తయారు చేయబడింది.




Bottled at
McDowell's Distillery

"కష్టాలూ, కన్నీళ్లూ ఒకరితో పంచుకోతగ్గవి కాదని నీ కెన్నడో చెప్పాను" నుదుటిమీద గుడ్డ తీసి మళ్ళీ తడిపి వేస్తూ అంది మాధవి. ఆమె చూపులు చేసేపనిమీద మాత్రమే వున్నాయి.

"ఔను. పంచుకో తగ్గవి కష్టాలూ, కన్నీళ్లూ కాదు. సుఖాలూ, సంతోషాలూ. మరి ఇప్పుడు నీ వెందుకు పరిగెత్తు కొచ్చినట్లో?" కోపంగా అంది వసంత.

నవ్వింది మాధవి పసి పాపాయిని చూసి

నవ్వినట్లు.

"కష్టాలు పంచుకునే మనోదారుఢ్యం అందరికీ వుండదు. పంచుకోవాలనే ఆదుర్దా, ఆ ఔదార్యం నీకున్నా నీలాటి సున్నిత మనస్కులకు పంచాలంటే మాకూ భయమే చూడు, పంచినందుకు దానికి రెండు రెట్లు కష్టం అందుకోమంటున్నావు. శ్రీనాధ్ అన్నయ్య ప్రేమ పరిష్వంగంలో ఏ బాధా తెలీకుండా పువ్వులా ఒదిగి వుండవలసిన దానివేగానీ కన్నీళ్లు పంచుకుని, కష్టాలు పెంచుకోవడం నీ స్వభావానికి పడదు."

కళ్ళు పెద్దవిచేసి ఆశ్చర్యంగా చూసింది వసంత.

"అయితే, నీ కష్టంలో పాలు పంచుకునే యోగ్యతే నాకు లేదంటావా !?"

ఫక్కున నవ్వింది మాధవి.

"వానపామూ, వానపామూ నేల గుల్ల చేస్తున్నావెందుకూ ?' అని అడిగితే 'రైతుకు మేలు చేస్తున్నాన'ని అందిట. రైతు నిన్ను ముక్కలుగా దున్నేస్తున్నాడు కదా ?' అంటే 'చేస్తే ఏం, ఒక్కదాన్ని రెండు చేస్తున్నాడుగా ?' అని మురిసి పోయిందట. అలా వుంది నీ కథ. నా కష్టంలో పాలు పంచుకుని లేని కష్టాలు తెచ్చుకున్నది చాలుగానీ ఇక ఆ విషయాలు ఆలోచించటం మానివేసి రెస్ట్ తీసుకో" అంది మాధవి నవ్వుతూనే.

"మధూ ! ఎలా నవ్వగలుగుతున్నావే!" ఆశ్చర్యంగా అడిగింది వసంత.

"నవ్వు వస్తుంటే నవ్వక ఏడవ మన్నావా ?" మళ్లీ నవ్వింది.

"అది నవ్వుకాదు. ఏడుపు తాలూకు వుధృత రూపం" బాధగా అంది వసంత.

నవ్వుమాని గంభీరంగా వుండిపోయింది మాధవి కొన్ని క్షణాలు.

సరిగ్గా అప్పుడే లక్ష్మి వచ్చింది ఎందుకో. ఆ పిల్ల చేతుల్లో బాబు వున్నాడు. గబుక్కున బాబును అందుకుని ముద్దుల్లో ముంచేస్తూ నవ్వసాగింది మాధవి.

'ఇది కన్నీటి నాపుకునే ప్రయత్నం' అనుకుంది వసంత. అయితే తను మాత్రం కన్నీటి నాపుకోలేకపోయింది.

## 10

మూడో రోజు శ్రీనాధ్ వచ్చి వసంతను చూసి కంగారు పడిపోయాడు. అయితే అప్పటికే టెంపరేచర్ నార్మల్‌కు వచ్చి తేలిగ్గానే వుంది వసంత. ఆ మూడు రోజులూ మాధవి లీవ్ పెట్టి వసంత నంటి పెట్టుకునే వుండిపోయింది.

ఒక వైపు ఆమె దురదృష్టానికి బాధ పడ్తున్నా సర్వస్వం తనే అయినంతగా తన నంటిపెట్టుకుని సేవలు చేస్తున్న మాధవి సాహచర్యం ఎంతో హాయిగా, నిశ్చింతగా వుంది వసంతకు.

ఒకవైపు ఆమె అనారోగ్యం ఆందోళన కలిగిస్తున్నా తనకోసం ప్రాణమైనా అర్పించగల ఈ వసంతకు ఇలా ఉపచర్యలు చేస్తూ, సన్నిహితంగా మసలడం ఎంతో తృప్తిగా, ఆనందంగా వుంది మాధవికి.

**జరిగిన కథ 5** గమ్యం తెలియకుండా ప్రయాణిస్తూ రైల్లో తారసిల్లిన మాధవిని తనతోపాటు తీసుకొస్తాడు శ్రీనాధ్ మాధవి, శ్రీనాధ్ భార్య వసంత స్నేహితులు. పెళ్ళి కాకుండానే గర్భవతయిన మాధవి వసంత ఇంట్లోనే వుండిపోతుంది. బిడ్డనుకన్న మాధవి కాలక్షేపంకోసం అంటూ పట్టుపట్టి వుద్యోగంలో చేరుతుంది. వేరే ఇల్లు తీసుకుని వెళ్లిపోతుంది మాధవి. వసంత పట్టుదల మీద తన జీవితంలో చీకటిని వదలి పోయిన సంఘటనలను గురించి చెప్పటం ప్రారంభిస్తుంది మాధవి. బి. యి. చదువుతున్న నరేంద్రతో పరిచయమౌతుంది మాధవికి. నరేంద్రకు ప్రేమభిక్ష పెడుతుందిమాధవి. మాధవి నరేంద్రలు రిజిష్టర్ మ్యారేజ్ చేసుకుంటారు. స్నేహితుడిపెళ్లికంటూవెళ్లిన నరేంద్రజీప్ ప్రమాదంలో మరణిస్తాడు.

శ్రీనాథ్ వచ్చిన సాయంకాలం ఇంటి ముందు పెంచిన మొక్కల మధ్య పేం కుర్చీల్లో కూర్చుని టీ తీసుకుంటున్నారు మాధవి, వసంత, శ్రీనాథ్ వసంత ఫుల్ హాండ్స్ స్వెటర్ వేసుకుని, చెవులకుమఫ్లర్ చుట్టుకుని వుంది. శ్రీనాథ్ కాళ్లకు మేజోళ్లు వేసుకొమ్మన్నాడుగానీ 'ఇవి కూడా తీసి పడేస్తాను' అని బెదిరించడంతో పూర్కుండిపోయాడు. దూరంగా గులాబీ మొక్కకు గొప్ప తవ్వుతూన్న రామన్న భుజాలు పట్టుకుని వూగుతున్నాడు బాబు. ఈ మధ్య వాడు మాధవి వసంతలే గాక ఇతరుల దోస్తీ కూడా చేయడం ప్రారంభించాడు.

సన్నజాజులు ఒక్కొక్క రేకే విచ్చుకుంటున్నాయి. వాటి నూతనోత్సాహాన్ని చూసి ముఖాలు ఎర్రగా మాడ్చుకున్నట్లుగా మందారాలు వడిలిపోతున్నాయి వాటి వాటి ఆనందాలూ, అసూయలూ కనిపెట్టిన గులాబీలు పక్కన నవ్వుతున్నట్లేవున్నాయి. నేల నంటి పెట్టుకున్న చామంతులు ఈ వింత చూడాలనే కుతూహలంతో నిక్కి నిక్కి చూసే ప్రయత్నంలో కాబోలు వూగుతున్నాయి. ఏ మెరుగని అమాయకురాలిలా పూలమించి గాలి తేలివస్తూ కాస్త పరిమళం దొంగిలించుకు వచ్చింది. 'అమ్మో! కనిపెట్టేశారా !' అనుకుని దొంగసొమ్ము కాస్తా శ్రీనాథ్ వగ్గైరాల నాశికాపుటాలకే వదిలేసి రివ్వుమంటూ పైకిపోయింది.

వున్నట్టుండి శ్రీనాథ్ అన్నాడు ఆలోచిస్తున్నట్లుగా "ఇంతకూ మాధవీ, పదేళ్ల పిల్లలూ, పదకొండేళ్ల పిల్లలూ తల్లులు కావడం చూశాంగానీ పుట్టినరోజే తల్లి కావడం— ఐ మీన్ కాబోవడం— నీ వెక్కడైనా చూశావా?"

నవ్వును బిగపట్టి లేదుగాక లేదన్నట్లుగా తల వూపింది మాధవి.

"కొన్ని నీట బ్రతికే ప్రాణులు ఒక వైపు పుడ్తానే మరో వైపు రెండుగా విడిపోతాయట. అవి మళ్లీ నాలుగ్గా, ఎనిమిదిగా...! మనుషులూ అల్లా మొదలెడితే— మైగాడ్— కాలు పెట్టేందుకు సందు వుంటుందా?" భయం నటించాడు శ్రీనాథ్.

'ఎలా వుంటుంది? వుండదు' అన్నట్లుగా గబగబా తల వూపింది మాధవి. పాపం ఆమె ముఖంలోనూ భయం చోటు చేసుకుంది.

వీళ్ల మాటలుగానీ, పరిహాసాలుగానీ గమనించడంలేదు వసంత. ఆమె చూపులు ఆలోచనలు మాధవి నంటిపెట్టుకునే వున్నాయి.

సాదా నేత చీరెలో, ఏ అలంకరణలూ లేకుండా స్వచ్ఛంగా, అతి సాధారణంగా, కడిగిన ముత్యంలా వుంది మాధవి! ఇంతకు

## శాంతితీరం

ముందయితే తనే 'సింపుల్ బ్యూటీ' అనుకుని ముగ్ధురాలై చూసేదేమో. ఈరోజు ఈ అందంలో ఏదో అపశ్రుతి!

కుర్చీకీ, వీపుకూ ఒత్తిడి అనేమో జడ ముందుకు వేసుకుంది. దానికి రిబ్బన్‌గానీ, పువ్వులుగానీ లేవు. శ్రద్ధగా దువ్వుకున్నట్టు కూడా లేదు. బాగా చెదిరి అలవోకగా వక్షోజాల మధ్యగా ఒళ్ళోకి జారిన ఆ కృష్ణవేణి నిజంగా రెండు కొండల నడుమ అగాధంలోకి దూకుతున్న కృష్ణవేణిలా వుంది. ఆ జడ, ముంగురులూ 'ఎంత పెద్ద కమలమో! చూద్దాం రండి' అన్నట్లుగా గుంపులు గుంపులుగా బార్లుతీరి పాకుతూ తలమీదికి చేరి ముఖం మీదకు వంగివంగి చూస్తున్న తుమ్మెదల్లా వున్నాయి.

ఎందుకో ఆ ఎర్రని పెదిమలు బిగించి నవ్వుతోంది ఆ బిగించిన పెదిమలతో నోరు ఇంకా విడీవిడని ఎర్రగులాబీలా వుంది. ఆ తడినీ, ఆ సన్నటి కదలికనూ చూస్తుంటే 'పొరబడలేదు. తప్పక అందులో పరిమళమూ వుంటుంది' అనే భ్రమ కలుగుతోంది.

పెదిమలు బిగించినా నవ్వు ఆగటంలేదు. మెల్లగా విడివడుతూనే వున్నాయి. ఎర్రని చిగుళ్ళూ, తెల్లని పలువరుసా — ముత్యాలు, పగడాలు కలబోసినట్లుగా ... ఎర్రని లక్క పిడతలో కలబోసినట్లుగా ...!

కళ్ళలో ఎందుకో భయం! లేడికళ్ళలా భయంగా చంచలిస్తున్నాయి! పూలను కదల్చగా భయంతో లేచి పారిపోయిన తుమ్మెదల్లా కనురెప్పలు! 'తుమ్మెదలు నా దగ్గరకు రావే' అని అలిగి, మూతి ముడుచుకున్న సంపెంగలా నాశిక! ఈ తతంగమంతా చూసి సిగ్గుతో ఎర్రబడిన రోజాల్లా బుగ్గలమీద ఎర్రచారలు!

ఎంత సౌందర్యం! సహజ సౌందర్యం! ఇదంతా ఎవరికోసం? అడవికాచిన వెన్నెల్లా అంతా వృధా. అడవి ఎన్నడైనా నరుకబడి వూరు కావచ్చు కానీ మాధవి జీవితం...? ఆమె జీవితంలో పెరిగిన అశాంతి అనే అడవి నరుకబడదు. నరికేవారున్నా నరేన్‌ను అంతగా ప్రేమించిన మాధవి...ఊహూ ...

"ఓయ్, అప్పుడే పాపాయిని గురించి కలలు కంటున్నావా? ఇంతసేపటిగా మేము




నీ గురించే మాట్లాడుతున్నామన్న విషయమైనా నీకు తెలుస్తోందా ?'' పరిహాస మాడాడు శ్రీనాధ్

ఉలికిపడ్డట్లయి ''ఆఁ ?'' అంది.

''మరీ అంత వులికిపడకు'' అంటూ వసంత చేయి నిమిరాడు శ్రీనాధ్. మాధవి నవ్వుతూ చూపులు తిప్పుకుంది.

మధ్యాహ్నం వచ్చినప్పటినుండీ అతని కెంతో సంతోషంగా వుంది. వసంత నెంతో అపురూపంగా, ఆరాధనగా, గోముగా చూస్తున్నాడు. రాగానే పరిస్థితి విని ఒక్క అంగలో వసంత దగ్గరకు వచ్చిపడ్డాడు. అప్పుడు మాధవి వసంతకు టెంపరేచర్ చూస్తోంది.

వేళకాని వేళలో పడక, పీక్కుపోయిన ముఖం, కళలేని కళ్ళు, ఎండిపోయిన పెదిమలు, నోట్లో ధర్మామీటర్ — శ్రీధర్ అదిరిపోయాడు. అమాయకురాలు, ముగ్ధ, ముఖ్యంగా సహృదయిని, అనుకూలవతి అయిన భార్య అంటే శ్రీనాధ్‌కు ప్రాణంలో ప్రాణం

''మాధవీ! వాట్ హాపెండ్ ? వాట్ హాపెండ్ టు హర్ ?'' అంటూ గాబరా పడిపోయాడు

మాధవి నవ్వుతూ ధర్మామీటర్ అందించింది. నార్మల్. రిలీఫ్‌గా నిట్టూర్చాడు శ్రీనాథ్. ఆ తర్వాత అతను స్వయంగా, తిరిగ్గా పరీక్షచేయగా తేలిన విషయం వసంత నెల తప్పింది !

శ్రీనాథ్ లేకపోతే మాధవి ఎగిరి గంతు లేసేదే అతను వుండటంతో అంత సంతోషాన్నీ నవ్వుతోనూ, వసంత చేయి ప్రేమగా నొక్కటంతోనూ మాత్రమే వ్యక్తం చేయగలిగింది. ఇక శ్రీనాథ్ సంగతి సరేసరి. మాధవి గురించికూడా మరచిపోయి పసిపిల్లాడిలా ఒక్క క్షణం ట్విస్ట్‌చేశాడు. వాళ్ళ స్వర్గాన్ని డిస్టర్బ్ చేయడం ఇష్టంలేక మెల్లగా లేచి ఇవతలకు వచ్చింది మాధవి ఆమెకు ఒక్క క్షణం తను నరేన్‌కు 'ఆ విషయం' చెప్పిననాటి సంఘటన గుర్తుకు వచ్చింది.

దాదాపు ప్రతి పురుషుడు తండ్రి అవుతాడు. తండ్రి అయిన ప్రతివాడూ సంతోషంతో నాట్యం చేస్తాడు. అయితే కొడుకు పుట్టాక ఆ సంతోషం సంపూర్ణంకాగా ఆ యిరువురినీ కలిపి చూసుకుని మురిసిపోయే భాగ్యం ఎందరు తల్లులకుంటుంది? విషాదంగా నిట్టూరుస్తూ టాయిలెట్‌కేసి వెళ్ళసాగింది మాధవి.

అయితే మాధవీ, శ్రీనాథ్‌లలా వసంత మనసు ఆనందంలో గంతులు వేయలేదు. జరగరాని సమయంలో జరగకూడనిదేదో జరిగినట్లుగా 'ఈ సమయంలోనా !?' అనుకొని చిరాకు పడింది.

వసంత పుట్టినరోజు పండగనాటి రాత్రే జ్వరపడింది. కాబట్టి, సింప్టమ్స్ కనిపించాయి కాబట్టి పుట్టిననాడే తల్లి అయింది అంటూ శ్రీనాధ్ పరిహాసమాడుతూ, మాధవిని సపోర్టర్‌గా తీసుకున్నాడు. అయితే అదేమీ వసంత గమనించలేదుగా ? అందుకే శ్రీనాధ్ పలకరించగానే వులికిపడింది. ఆమె వులికిపాటుచూసి శ్రీనాధ్ కంగారు పడి ఆమె చేయి నిమరటంచూసి మాధవి నవ్వుతూ చూపులు తిప్పుకుంది. గేట్ వైపు తిరిగిన మాధవి చూపులు ఒక్క క్షణం ఆశ్చర్యంగా, నిశ్చలంగా నిలిచాయి. ఎవరో యువకుడు పేషంట్‌లా లేదు. చేతిలో సూట్‌కేస్ వుంది. ఖరీదైన గుడ్డలు బస్సు ప్రయాణం చేసినట్లుగా ఎర్రటి దుమ్ము కొట్టుకుని వున్నాయి. ఒక్క క్షణంలో ఆ మాత్రమే చూసింది. ఇంతలోనే శ్రీనాధ్ సంతోషంతో కేక పెట్టాడు ''అరె! కుమార్ !'' అంటూ. మాధవి మరోసారి చూపులు తిప్పుకుంది.

శ్రీనాధ్ కేకవేశాడు ''రామన్నా, లోపలికెళ్ళి మరోకుర్చీ తీసుకురా.''

ఆ నూతన యువకుడు వీళ్ళున్నదగ్గరకు రావడమూ, రామన్న పురుకులు పరుగులతో కుర్చీ తెచ్చివేయడమూ ఒక్కసారే జరిగాయి.

వసంత, శ్రీనాథ్ ఎంతో ఆప్యాయంగా ఆహ్వానించారతణ్ణి.

మాధవి లేచి పోబోయింది.

''అరె! ఎక్కడికి ? కూర్చో కూర్చో. కుమార్ మనవాడే'' వారించాడు శ్రీనాథ్.



ధర్మపథం

# సంగ్రహ రామాయణం

బులుసు వేంకటరమణయ్య



**భా**రతీయులకు ప్రధానమైన గ్రంథాలలో శ్రీమద్రామాయణం మొదటిది. అందులో వర్ణింపబడిన శ్రీరాముని చరిత్రలోని ఒక్కొక్క అక్షరమూ మహాపాతకాలను నశింపజేస్తుంది. రామాయణంలోని కొంచెం భాగాన్నయినా నిత్య పారాయణ చేసేవారు మనలో చాలామంది ఉన్నారు. సంగ్రహంగా రామాయణాన్నంతనూ ఒక శ్లోకంలో ఉన్నదానిని చదివితే సమగ్ర రామాయణ పఠన ఫలం లభిస్తుందని విశ్వసిస్తారు. నిత్య పారాయణకు అనుకూలమైన ఆ శ్లోకం యిది—

శ్లో. "పూర్వం రామ తపోవనాను గమనం హత్వా మృగం కాంచనం
వైదేహీ హరణం జటాయు మరణం సుగ్రీవ సంభాషణమ్,
వాలీ నిగ్రహణం సముద్ర తరణం లంకాపురీ దాహనం
పశ్చాద్రావణ కుంభకర్ణ హననం ఏతద్ధి రామాయణమ్."

తండ్రి ఆనతి ననుసరించి రాముడు రాజ్యాన్ని విడిచి వనవాసానికి వెళ్ళిపోయాడు రాముణ్ణి మోసగించి పర్ణశాలనుంచి దూరానికి తీసుకుపోవడానికి మారీచుడు కాంచన మృగంగా మారగా రాముడు దాన్ని చంపివేశాడు. ఆ సమయంలోనే రావణుడు సన్యాసి వేషంతో పర్ణశాలకు వచ్చి సీతాదేవిని అపహరించాడు. రాక్షసరాజు ఆమెను విమానంలో తీసుకొనిపోతూ ఉండగా జటాయువు అడ్డగించి దెబ్బలుతిని రామునికి ఆ వార్త తెలిపి మరణించాడు. తర్వాత సుగ్రీవునితో మైత్రి చేసుకుని, అతనితో సంభాషించి, అతని కోరిక ప్రకారం వాలిని సంహరించాడు. హనుమంతుడు సీతా వృత్తాంతాన్ని తెలుసుకుని రావడానికి సముద్రాన్ని లంఘించినాడు అతడు జానకీదేవిని చూచి, లంకా నగరాన్ని దహించాడు. తర్వాత శ్రీరాముడు వారధి మూలంగా లంకలో ప్రవేశించి రావణ కుంభ కర్ణాదులను సంహరించాడు." అని శ్లోక తాత్పర్యం

ఇందులో రామాయణంలోని ప్రధానాంశాలన్నీ క్లుప్తంగా ఉన్నాయి వ్యాకరణం సంగతి అటుంచి చూస్తే ఎంతో సులభంగా కానవస్తుంది నిత్యమూ దీనిని తమ తమ ప్రార్థన శ్లోకాలతో సహా పఠించేవారు చాలామంది వున్నారు

పాపాలను పోగొడుతూ, సంగ్రహంగా రామాయణాన్ని స్మరణకు తెచ్చే యీ శ్లోకాన్ని పఠించడం ఎంతో మంచిది.

మాధవి కూర్చుంది.

"కుమార్, ఈమె మాధవి మాకు ఆడపడుచులేని లోటు తీర్చే చెల్లాయి" అన్నాడు శ్రీనాథ్

అప్పుడే ఆమెకేసి తిరిగిన కుమార్ ఒక్క క్షణం నిశ్చలంగా చూశాడు. ఆ చూపుల్లో అపురూపమైన దాన్నేదో అనుకోకుండా చూసిన భావం తళుక్కుమంది

"మా మేనత్త కొడుకు, కుమార్. ఎమ్మెస్సీ."

## శాంతి తీరం

"మరచిపోయారా ... " అంటూ నవ్వింది వసంత.

"జ్ఞానాను. ఎమ్మెస్సీ అందాల్లో రచయిత" పూర్తి చేశాడు శ్రీనాథ్

అతడు నమస్కరిస్తూవుంటే తనూ ప్రతినమస్కారం చేసింది మాధవి.

"లక్ష్మి టీ తే"

కుమార్ కోసం టీకలుపుతోంది వసంత.

"ఏగా ఇన్నేళ్ళకుగానీ గుర్తు రాలేదా ?" దబాయించాడు శ్రీనాథ్

"ఎన్నేళ్ళు? రెండేళ్ళే కదా? మామయ్య కాశీ వెళ్ళేప్పుడు వచ్చి వెళ్ళాను అయినా మేనత్తను మరచిపోవడం కంటే ఇదేం విడ్డూరం కాదులే" నిష్ఠూరంగా అన్నాడు కుమార్ నవ్వుతూనే

"నా కంటె బోల్డు పనులు, బాధ్యతలు" ఏదో బరువు మోస్తున్న వాడిలా భారంగా అన్నాడు శ్రీనాథ్

"అందుకే కాబోలు తీరిగ్గా తోటలో కూర్చుని గాలి మేస్తున్నావు" చురక అంటించాడు కుమార్.

శ్రీనాథ్ ఎంత మాత్రం బెదిరిపోలేదు.

"మెయ్యటం లేదోయ్ బావమరిదీ. మేవుతున్నాను మీ చెల్లాయికి ప్రస్తుతం మధురమైన జబ్బొకటి పట్టుకుందిలే" అన్నాడు వసంత కేసి క్రీగంట చూస్తూ.

"మధురమైన జబ్బా!" ఆశ్చర్యంగా అడిగాడు కుమార్.

మాధవికి నవ్వు వస్తోంది.

"కొంపదీసి మీ భాషలోకి అనువదించుకునేవ్. మీ భాషలో మధురమైన జబ్బు, మధురమైన బాధ, తీయని నొప్పి—ఇవన్నీ ప్రేమ లక్షణాలు కదూ ?"

"హార్నీ! బావా! నీ వెప్పుడు రచయితవయ్యావయ్యా!" నోరు తెరిచాడు కుమార్.

"ఆ మాత్రమైనా కాకపోతే మన కవమానం కాదా అన్నయ్యా ?" నవ్వుతూ అంది వసంత

"అది నిజమే చెల్లాయ్ అయినా వైద్య శ్రేష్ఠుడు కదా ఆ గాలీ, ఈగాలీ కలవ్వే!" అన్నాడు 'అయ్యో ఎలాగా!' అన్నట్లు

"అదేం కాదుగానీ మీ రచయితలున్నారే, అసంఖ్యాకంగా రాసి మా మీద పడేస్తుంటారు కదా? చదవకపోతే సాహిత్యాభిమానం లేదనీ, భాషాభిమానం లేదనీ మళ్ళీ దానిమీద బోలెడు సాహిత్యం. అదీ మేమే చదవాలి. ఎందుకొచ్చిన గొడవాని వచ్చిన పుస్తకం వచ్చినట్లు ఓసారి చదివి..."

"అన్యాయం, అవమానం. రచయిత సోదరులు ఇది వింటే విప్లవం లేవదీస్తారు; సమ్మె చేస్తారు..."

".. నిరాహార దీక్ష చేస్తారు, ఘెరావ్ చేస్తారు..."

## చేసిన పరీక్షల వలన తేలింది...







# రుచికీ, విటమిన్లకూ, పుష్టికీ బిస్కట్ అంటేనే ఇది

## బ్రిటానియా గ్లూకోజ్-డి



బ్రిటానియా గ్లూకోజ్-డి బిస్కట్లతో పాటు మరో ప్రముఖ బ్రాండ్ గ్లూకోజ్ బిస్కట్లను పోల్చి చూసేందుకు చేసిన పరీక్షల వలన తేలిందేమిటంటే: విటమిన్లు మరియు మొత్తం మీద పుష్టినిచ్చే పదార్థాలు గ్లూకోజ్-డిలో ఎక్కువగా ఉన్నాయని. అంతేగాక రుచికోసం, తియ్యదనం కోసం, కరకరలాడే తనానికి దీనిని కావాలంటారని. శక్తినిచ్చే విషయంలో, గ్లూకోజ్ కన్న గ్లూకోజ్ డి 20% ఎక్కువ శక్తినిస్తుంది! బ్రిటానియా గ్లూకోజ్-డి-తియ్యటి రుచితో కూడిన శక్తి!




**అందుకే మరి ఏ ఇతర గ్లూకోజ్ బిస్కట్‌కన్న బ్రిటానియా గ్లూకోజ్-డి అంటేనే ఎక్కువ మంది ఆకర్షితులవుతున్నారు.**

**బ్రిటానియా** బ్రిటానియా బిస్కట్లు అత్యుత్తమమైనవి

లింటాస్-B3C.GL-10-140 TL




## శాంతితీరం

చెవులు మూసుకుంది వసంత 'అబ్బబ్బ' అంటూ.

ఇద్దరూ సడన్‌గా మౌనం ధరించారు. మాధవి నవ్వాపుకోలేక పోయింది. వసంత శ్రీనాధ్ కుమార్‌లో మాట్లాడే విధానం చూస్తుంటే అతనికీ, వీళ్ళకూ మధ్య చాలా ఆత్మీయత, దగ్గరితనం వున్నట్లు తోచింది మాధవికి. నవ్వాపుకుంటూ దూరంగా రామన్నను తరుముతూ కలకల నవ్వుతూన్న బాబును చూస్తూ వుండి పోయింది. మాధవి చూస్తుండగానే అడుగులు తడబడి బాబు క్రింద పడిపోయాడు. మాధవి కంగారుగా చూడసాగింది. రామన్న గభాలున బాబును లేపి, మట్టి దులిపి, ఎత్తుకుని వీళ్ళున్న దగ్గరకు ఎత్తుకు వచ్చాడు. దగ్గరకు రాగానే బాబు ఏడుపు మాని వసంతవైపు చేతులు చాపాడు నవ్వుతూ. తల్లి దగ్గర కంటే బాబుకు వసంత దగ్గరే ఎక్కువ చేరిక.

బాబును అందుకుని ముద్దు పెట్టుకుంది వసంత.

ఆశ్చర్యంగా చూస్తూ "వాటె వండర్! వీడెవ్వడు...?" అన్నాడు కుమార్.

"వీడు మాధవి కొడుకు" అన్నాడు శ్రీనాథ్ వాడి బుగ్గ గిల్లుతూ.

ఆశ్చర్యంగా మాధవి వంక చూశాడు కుమార్ అరక్షణం.

"ఆ.. రామాయణంలో పిడకల వేటలా మరేదో గొడవలో పడ్డాము కదూ? కుమార్ త్వరలోనే మీ చెల్లాయికి ఇలాంటి..." నవ్వేశాడు శ్రీనాధ్.

"వాటె వండర్!" మరోసారి ఆశ్చర్య పోయాడు కుమార్ ఆ వెంటనే "హార్టీ కంగ్రాచ్యులేషన్స్ బావా" అంటూ శ్రీనాధ్ చెయ్యి నలిపేశాడు.

ఆ దృశ్యం ఎంత సుందరంగా, ఎంత మధురంగా కనిపించిందో మరి, వసంత చిరునవ్వు చిందించింది

### 11

మాధవి మామూలుగా స్కూలుకు వెళ్తోంది. వసంత ఆరోగ్యంగానే వున్నా ఆమె మనసు మాత్రం ఈ సమయంలో వుండవలసినంత వుల్లాసంగా లేదు స్తబ్దుగా వుంటున్న వసంతను మాధవి ఒకసారి మందలించింది

"అన్నయ్య నీ దిగులు చూసి ఏమను కుంటారు? ఏదో వుంది చెప్పమని బలవంతం చేస్తారు. నీ కంటే ముందుగానే తెలిసిందిగానీ ఈ సంతోష సమయంలో అన్నయ్యకు తెలిస్తే ఎంత బాధ పడ్తారో ఆలోచించు. నీకు చెప్పే ఎంతో బాధ పడ్తున్నాను 'నా కథ తెలుసు కదా తల్లివి కాబోతూన్న సంతోషాన్ని పూర్తిగా అనుభవించలేక పోతోంది వసు' అని, ఇక అన్నయ్య ఆనందాన్ని కూడా హరించి పుణ్యం కట్టుకొమ్మన్నావా?"

మరి వసంత ఏమనుకుందోగానీ అప్పట్నుంచీ కాస్త హుషారుగానే వున్నట్లు కనిపిస్తోంది. (ఇంకా వుంది)

## హైదరాబాద్ నోట్ బుక్

### జనతాపార్టీ సన్నాహాలు

రాష్ట్రవిధానసభ ఎన్నికలు దగ్గరవుతున్న కొద్దీ కాంగ్రెస్, జనతాపార్టీలు తమ బలాబలాల ప్రదర్శనకు సన్నద్ధమవుతున్నాయి. జనతాపార్టీ కొత్తసభ్యుల నమోదుకు ముమ్మరంగా ప్రయత్నిస్తున్నది. కాంగ్రెస్‌లోని వివిధ వర్గాల మధ్య సంధి కుదిరింది గనుక, ఈసారి రాష్ట్రం ఎప్పటిలాగే కాంగ్రెస్‌కు కంచుకోటగా వుండగలదని కాంగ్రెస్ ప్రముఖులు గట్టి నమ్మకంతో ఉన్నారు. కాని, కాంగ్రెస్‌వారి ఇప్పటిసమస్య బహుకాలంగా వున్న ప్రతిష్ఠను ఎలా నిలుపుకొందామా అన్నదే కాని, జనతా సమస్యవేరు, జనతా నిజంగా జనతాపక్షంగా ఎలా తయారు కావాలన్న విషయం జనతానాయకులకు నిరంతర జపమైంది. అత్యవసర పరిస్థితిలో కాంగ్రెస్ చేసిందేమిటో జనానికి, పత్రికా స్వాతంత్ర్యం పుణ్యమా అని తెలుస్తున్నది గనుక రాష్ట్రంలో కాంగ్రెస్‌పై విజయం సాధించగలమనే జనతా నాయకులు విశ్వసిస్తున్నారు. జనతాపార్టీలో కొత్త సభ్యుల చేరిక విరివిగా కొనసాగుతున్నదని రాష్ట్ర జనతా కార్యాలయం వర్గాలవారు తెలియజేశారు. దశాబ్దాలుగా కాంగ్రెస్‌లో ఉండి, నాయకుల నిరంకుశత్వానికి గురియై, అనుకొన్న సేవ చేయలేక విసిగివేసారిన కాంగ్రెస్ కార్యకర్తలు అసంఖ్యాకంగా జనతాలో చేరుతున్నట్లు ఒకరు తెలియజేశారు. అలాటివారిలో శ్రీమతి రాచకొండగౌరమ్మ గారిని పేర్కొనవచ్చు. ఈమె ఏలూరు వాసిని కీర్తిశేషులు ఆర్ బి గౌరిపతి సతీమణి సుప్రసిద్ధ కాంగ్రెస్‌వాది శ్రీ పాలకోడేటి గురుమూర్తి సోదరుని కుమార్తె. 1929 నుండి శ్రీ గురుమూర్తితో కలిసి కాంగ్రెస్‌లో పనిచేశారు, హరిజనోద్యమంలో ముమ్మరంగా పనిచేశారు. 1939లో గౌరవమేజిస్ట్రేటుగా వున్నారు. యుద్ధ సమయంలో ఎ ఆర్ పి శిక్షణ పొంది, యుస్ఫీన్ పేట వార్డెనుగా పనిచేశారు. విజయవాడలో ఎ.ఆర్ పి. లెక్చరర్‌గా పనిచేశారు. 1952లో శ్రీమతి దుర్గాబాయి ఎన్నికల ప్రచారం చేశారు. ఇంత చేసినా 1957 ఎన్నికల్లో కాంగ్రెస్ టిక్కెట్టు కోసం ప్రయత్నిస్తే, పైవారు నిరాకరించారు. కాంగ్రెస్‌లో ముఠాల పేరుకొనిపోయిన అవినీతికి విసిగి నాలుగు దశాబ్దాల కాంగ్రెస్ భక్తిని విడనాడి ఈమె ఢిల్లీకివెళ్లి శ్రీ నానాజీదేశ్‌ముఖ్ మున్నగు జనతా నాయకులతోను, ప్రధాని మొరార్జీతోను సంప్రదించి పశ్చిమ గోదావరిజిల్లాలో జనతా విజయానికి కంకణం కట్టుకొన్నారు. శ్రీమతి రాచకొండ గౌరమ్మ వంటి కాకలుదీరిన, నిస్వార్థ కార్యకర్తలను జనతాపార్టీ సమీకరించుకోవాలి. దక్షిణ రాష్ట్రాలలో ఎన్నికల ప్రచారానికి ఏర్పడిన జనతా సంఘం ఈ విషయం పరిశీలించాలి.

### డాక్టర్ జ్ఞానానందకవి కవితాఘోష!

డాక్టర్ గోపాలరెడ్డి అన్నట్టు బస్సుల ఎరడ తో జనసమ్మర్దపు రొదతో దిబ్బెడవేసి జంట నగరాల సహృదయుల శ్రవణేంద్రియాల తుప్పు వదలింది ఆగస్టు 8వ తేదీన ఆంధ్ర సారస్వత పరిషత్తు హాలులో డాక్టర్ జ్ఞానానంద క కవితా ఘోషతో. జ్ఞానానందకవి వేణు గం నాదంతో కవితాగానం చేసి, శ్రోతల హృ యాలు ఉల్లసింపజేశారు. ఆనాడు తన మూడు కావ్యాలు— క్రీస్తు ప్రబంధము, 'వెలుగుబాట', నా జీవిత గాథ ఆవిష్కరణోత్సవంలో డాక్టర్ గోపాలరెడ్డి ఈ మూడు కావ్యాలను ఆవిష్క గిస్తూ గాంధీజీ హరిజనోద్యమమంతా హరిజ తోను, అక్కడ దళిత వర్గాలలోను కలిగిన చైత న్యం కవితాముఖంగాను వెల్లడికిందని, స్వయం కృషితో అలా పైకి వచ్చినవారిలో జ్ఞానానం కవి ఒకరని ఈయన వడదెబ్బ ఎదురీది, తుఫా కు తట్టుకుని పైకి వచ్చిన ధీరుడని, తెలుగులో క్రైస్తవ కవులు దాదాపు వంద మంది ఉంటారని అన్నారు. క్రీస్తు ప్రబంధం ఏసుక్రీస్తు జననం వరకు గాథ వర్ణితం. వెలుగు బాటలో సమకాలిక సమాజం చిత్రితమయింది. నా జీవన గాథ జ్ఞానానందకవి ఆత్మకథ. డాక్టర్ దివాకర్ల వేంకటావధాని, డాక్టర్ జి వి. సుబ్రహ్మణ్యం జ్ఞానందకవి కావ్యాలలోని కవితా శిల్పాన్ని నైపుణ్యాన్ని, ధారాశుద్ధిని గురించి వివరించారు. జాషువా కవితలో వేదన బోధన ఉన్నది. జ్ఞానా

నంద కవి కావ్యాలలో సాధన, శోధన ఉన్నవి ఓజస్సు, శ్రవణేంద్రియాన్ని, మనస్సును ఆకర్షిస్తాయి అని డాక్టర్ సుబ్రహ్మణ్యం ప్రశంసించారు జ్ఞానానందకవి కృతజ్ఞత తెల్పుతూ తమ గురువులయిన విశ్వనాథ వారిని సగౌరవంగా

## హైదరాబాద్ నోట్ బుక్

స్మరించారు తన బాధలన్నిటినీ కవితలో పెట్టానని అన్నారు ప్రారంభంలో శ్రీ రామానుజరావు స్వాగతం చెప్పగా, ప్రాచ్య కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ కోయిల్ కందాడై రంగాచార్యులు కృతజ్ఞత తెలిపారు.







### శ్రీ సంజీవయ్య జీవిత చరిత్ర

శ్రీ దామోదరం సంజీవయ్య స్మారకసంస్థ శ్రీ సంజీవయ్య జీవిత చరిత్ర రచనకు డాక్టర్ కొంకలూరి ఇనాక్‌ను నియమించడం చాల ప్రశంసనీయమైనపని డాక్టర్ ఇనాక్ ఇటు సర్జనశీలురు, అటు పరిశోధకులు గడిదేరిన రచయితలు మీదుమిక్కిలి శ్రీ సంజీవయ్య పై గౌరవం కలవారు .ఎవరు శ్రీ సంజీవయ్య పరిచితులన్నా, ఎక్కడ ఏ కొంచెం విషయం తెలుస్తుందన్నా అక్కడికి రెక్కలు కట్టుకొని వాలి సంజీవయ్య జీవిత విశేషాలు సేకరిస్తున్నారు డాక్టర్ ఇనాక్ ఈ విషయ సంపాదన యాత్రలో నన్ను గూడ కలుసుకొన్నారు. డాక్టర్ ఇనాక్ రచనతో శ్రీసంజీవయ్య సర్వతోముఖమైన జీవిత చరిత్ర సమగ్రంగా ఆంధ్రావళికి అందగలదనడంలో సందేహం లేదు.

### ఉపశ్రుతి

"ఏంసార్, మీకు సన్మానమంటే చూద్దామని వచ్చాము చివరకు పూలదండయినా లేదే? అన్నారు నాతో పత్రికారచయితల మహాసభకు వచ్చినవారు ఉరుదూ విదుషి శ్రీమతి కె.కమలమ్మ. "పూలలో ఏమున్నదండీ, ఒక నెప్పు చాలునని ఒక అజ్ఞాతకవి ఎపుడో అన్నాడండి—

మిలే న ఫూల్ తో తుర్బత్ పర్
ముసుక్కురాదేనా,
సునాహై ఫూల్ బరస్తేహై
ముసుక్కురానే పే.

నెచ్చెలి, నా సమాధిపై వేయడానికి పూవులు దొరక్కపోతే చిరునవ్వు నవ్వు చిరునవ్వులు పూవులు కురిపిస్తాయని అంటారు అన్నాడు కనుక పూవుల దండలు లేకపోతేనేమి? అన్నది

—తిరుమల రామచంద్ర



# రేయి ఎంతో హాయి

(17వ పేజీ తరువాయి)

కనిప్పుడు ఏమన్నానని అంతగా విరుచుకు పడతావు."

"అవునండి మీరేమి అనలేదు అసలు అనరు పాపం సంగనాచులు. అన్నీ నేనే అంటున్నాను. మీరు దేవతలు – నేనే రాక్షసిని."

"అదికాదు శ్యామలా ఇంటి అలంకరణ గురించి, వంట వార్పులు గురించి ఏదో నీకు చెబుదామని వస్తే అది సాంతం వినకుండానే ఏదో పూనకం వచ్చినట్లు మాట్లాడతావేంటి?"

"ఆ గృహ అలంకరణ .నా బొంద అలంకరణ మీలాంటి మొగుడితో ఏ అలంకరణ చేసుకోగలదు ఎటువంటి పెళ్లామయినా"

"పిచ్చిగా మాట్లాడకు. మాట్లాడే ముందు ఏం మాట్లాడుతున్నావో కొంచెం అర్థంచేసుకో."

"ఏమిటండీ పెద్ద అర్థం చేసుకునేది. మిమ్మల్ని చాలా అర్థం చేసుకున్నాను. కాపరానికి వచ్చినప్పట్నించి ఒక్కతే ఎలా చేసుకుంటోందో అని 'కించిత్' ఆలోచించారా? ఏ క్షణాన్నైనా ఇక్కడ వస్తువు తీసి కాస్త అక్కడ పెట్టారా? అసలు పెడదామనే తలంపుందా? ఏదో అన్నిటికీ సర్దుకుపోతూ పిచ్చిదానిలాగా వండి పడేస్తుంటే ఊరికే కూర్చోలేక ఎర్రి పొడుపులు, వెక్కిరింతలు ..అవీ లేకపోతే, ఎవరితోనో పోలికలు...అసలు మిమ్మల్ని చూస్తుంటేనే ఒళ్లు మండుతుందండీ."

శాస్త్రిలోకూడ అసహనం పెరిగింది.

"సత్యా కిక్‌డ్ శ్రీకృష్ణ ... ఏం వాయిస్ నాన్నా?" మధ్యలో ఏదో ఇంగ్లీషు పుస్తకం తీసుకొచ్చి, రవి అడిగాడు.

"నీ బొంద వాయిస్. కాసేపు అవతలికి ఏడు. ." శాస్త్రి మళ్లీ అందుకున్నాడు.

"ఒక్కరోజు... ఒక్కక్షణం కొంపలో ప్రశాంతంగా ఉండదుకదా. మంచికి ఏదన్నా చెబుదామన్నా వినే వోర్పు ఉండాలి మనిషికి. ఇల్లంటే ఒక స్వర్గసీమ. ఆనందానికి, సౌందర్యానికి నిలయం. దానిని ఎంత చక్కగా పెట్టుకుంటే అంత ఘనత. ఆ సందర్భంలో కమల వాళ్ల యిల్లు చూడు. ఎంత నీట్‌గా ఉంటుందో అలా మనిల్లు




కూడ.. అదిరేదు... అయినకాడికి రైలు యింజనులా కూతలు పెట్టడం తప్ప..."

"ఎందుకండీ వచ్చి అబద్ధాలు ఆడుతారు నేను కాపరానికి వచ్చినప్పట్నించి చూస్తున్నాను...", "కమలవాళ్ల యిల్లు" ఇదే మీనోటమీద నేనెప్పుడైనా అలంకరణ ఇంటికి చెయ్యాలన్నానా? అంత సౌందర్యోపాసకులు... గోళ్లు గిల్లుకుంటూ కూర్చోపోతే మీరు చేసుకోరాదు... ఇంటి అలంకరణ? మిమ్మల్ని నేను చెయ్యవలసిందే? 'సౌందర్యం' అంటే మీకేకాదు... చిన్నప్పట్నించి నాకు మనసేనండీ ... నేనూ మనిషినే. మనిషి ఎంత వికారంగా ఉన్నా, ఏదో ఒక మూల, ఏదోరూపంలో సలకంలైనా "అందం" గోచరించకుండ ఉండదండీ. మూతినిరుపులోనో, మాట వరుసలోనో, స్వరంలోనో... ఆఖరికి కోపంలోనో ఆవగింజంతైనా "అందం" ఉంటుందండీ, చూచే కళ్ళు అవి గుర్తించాలిగానీ... మీకు అవి చూచే వోపెక్కడుంటుందిలెండి ... ఎప్పుడూ అద్దం ముందర కూర్చుని, వో సినిమా హీరోననుకుంటూ ఉంటారయ్యే"

శాస్త్రి మొహం కందిగడ్డలా ఎర్రబడింది. శ్యామల ఆపలేదు.

"'డ్రాయింగ్ రూమ్'లో షో కేసు గుండు గోడకు మార్చాలని క్రిందటి ఆదివారమే అన్నారు ... ఎవరు మార్చాలి? నేనొక్కదానిని మార్చగలనా? లేకపోతే, మీరు పెట్టిన పని మనుషులు ఇంటినిండా ఉన్నారనా వాళ్లలో పెట్టించనికి? 'కిచెన్ షెల్ఫ్' నీట్‌గా ఉండాలి అని గోల చేస్తారు. కోడి కూసిందగ్గరనుంచి రాత్రి పొద్దుపోయేవరకు వంటలూ, వార్పులూ, మీ పిల్లల సేవలు . బాగా పొద్దుపోయిన తరువాత మీకు ఏకాంత సేవలూ .. ఈ సేవలతోనే చావనా... లేక, మీతో బాటే సుతారంగా కూర్చుని, మీలాగే నీట్‌గ, నీట్‌గ' అంటూ కబుర్లు చెప్పనా? మాట్లాడరేం .. ఎదుటివారికి చెప్పడం తేలికేనండీ . చెప్పేముందు కొంచెం మన 'విస్డమ్' అంత బుర్రకూడ ఉండాలండీ.."

"శ్యామలా! ఒళ్ళు దగ్గర పెట్టుకుని మాట్లాడు..."

"మీరుకూడ ఒళ్లు దగ్గర పెట్టుకుని ఎదుటివారికి పనులు చెప్పండి . లేకపోతే ..అమ్మో! అమ్మో! నా ముందర... నా పిల్లల ముందర పలికించుకుంటూ సిగ్గు లేకుండా "కమల, ఇల్లు, కమల ఇల్లు" అని జపం చేస్తారా? కమల ఇల్లు నీట్‌గ ఉందా! అసలు కమలే నీట్‌గా ఉందా మీ కళ్లకు..."

"నోర్ముయ్... పిచ్చివాగుడుకు హద్దు ఉండాలి కొడితే చెంప పేలుతుంది"

శాస్త్రి గంభీరంగ తయారయాడు

శ్యామలకు కోపం ఇంకా రెండింతలయింది

"అవునండీ. కొడతారు చంపేస్తారు

## రేయి ఎంతో హాయి

అంతకంటే మీరేం చేయగలరు పాపం! 'కమల ఇల్లు బాగుంది' అని చెవిలో జోరీగ లాగ గోల చెయ్యటం తప్ప కమల మొగుడులా మీరెందు కుండరూ?''

ఆయన పెళ్లాన్ని చక్కగా చూసుకుంటాడు. పిల్లలందరికి నీళ్లు పోస్తాడు. పంపు దగ్గర నీళ్లు పడతాడు. బట్టలన్నీ చక్కగా ఐరన్ చేస్తాడు. అఖరికి కమల చీరెలతో సహా.

ఆహా... అటువంటివి పోలికలకు కనిపించవ్. అయనలా సహాయం చేస్తున్నాడు కాబట్టే కమలకు వ్యవధి చిక్కుతోంది. కమల తన యిల్లు అంత అందంగా అలంకరించ కలుగుతోంది.

కమలకు రాళ్ల నెక్లెస్ చేయించాడు. మీరు చేయించారా? కమలను 'లాంబ్రెట్టా' వెనుక కూర్చో పెట్టుకుని జాలీగా సాయంత్రం అలా అలా తిప్పి సినిమాలకు తీసికెడతాడు. మీరు జన్మలో తీసుకెళ్లారా''

శాస్త్రి ఇన్‌ఫీరియారిటీ ఫీలయ్యాడు. శ్యామలవైపుగాఎందుకోకొద్దిగాజంకుతూనే చూశాడు. శ్యామల ఉన్నట్లుండి పెద్దగా ఏడుపు ప్రారంభించింది. పైట కొంగుతో కళ్లు తుడుచుకుందేమో కాటికంతా కమ్ముకుని కళ్లంతా ఎర్రబడి చింతనిప్పుల్లా ప్రకాశిస్తున్నాయి. శ్యామలని తదేకంగా చూస్తుంటే, ఆ భీకరమోముతో, శాస్త్రికి కించెత్ అదురు పుట్టింది. అక్కడ నుంచి వెళ్లిపోవటం ఎందుకైనా మంచిదనేతలంపు పుట్టింది శాస్త్రికి.

శ్యామల చిర్రుస చీది మళ్లీ మొదలు పెట్టింది.

''నే నేమన్నా నగలు కొనమన్నానా! పట్టు చీరెలు తెమ్మన్నానా! ఇంట్లో వంటలక్కకు పారేసినట్లు ఇంత కూడు పారేస్తున్నారు. నాలాంటి వాళ్ల ఉసురు ఊరికే పోదండీ... అసలు నామీద ప్రేమే చచ్చిపోయిందండీ మీకు ఈమధ్య. అంత ఇష్టం లేకపోతే ఓ చిటికెడు విషం తీసుకొచ్చి పారెయ్యండీ, మీరు సుఖంగా ఉందురుగాని.

పిల్లలకోసంగాని... మీకోసం కాదండీ నేను బ్రతికేది. వాళ్లు దిక్కులేని వాళ్లయిపోతారనిగాని... నాకు నిజంగా బ్రతకాలనిలేదు. మీతో కాపరం చెయ్యటం కంటే

శాస్త్రి మొహం కూడా ఎర్రబడింది కోపంతో.

పిల్లలందరూ తెల్లబోయి బిక్కు బిక్కుమంటూ చూస్తున్నారు, పెద్దవాడు ఇది సాంతం ఇలాంటివన్నీ అలవాటయినవాడులా చాలా తాపీగా ఏదో వ్రాసి పుసుక్కుంటు న్నాడు.

కిచెన్‌నుంచి పరుగుగా బయటకు రాబో తున్న శాస్త్రి, ఇంద వెప్పుడో కూర్చున్న వంటపిల్ల దొడ్డికి కనుక్కున రాక్కా, షాక్ తిన్నవాడిలా విస్మయపోయినిలబడ్డాడు.

"ఛీ. ఛీ వెధవ కొంప... ఒక్కపని సవ్యంగా జరగదు దరిద్రపు మనుషులు" అంటూ కుంటుకుంటూ సంపు దగ్గరకు వెళ్ళాడు అక్కడకు వినపడదేమోనని శ్యామల బిగ్గరగా ఏడుస్తోంది

"ఇల్లంతా పాక్కుకుంటూ పోతే ల భండాలం ఎవరు కనుగురారు? ఇల్లంతా 'నీట్'గా ఉండాలి... ఆ మాత్రం తెలియక పోతే ఎలా" అంటూ అరుస్తోంది;

"నోరు మూసుకో శ్యామలా. ఛఛ... వెధవ సంసారం... కొంపలో ఒక్క క్షణం ఉండటానికి వీల్లేదు. బ్రతుకు మీద విరక్తి పుడుతోంది. నాకు చావాలని ఉంది. నేను చచ్చిపోతాను .."

శాస్త్రి యింకా ఏదో అనబోతున్నాడు. శ్యామల అంత స్పీడులోను అందుకుంది.

"మీకే కాదండీ.. నాక్కూడ అలానే ఉందండీ... నేను చచ్చిపోతాను." అంటూ వడివడిగా, అడుగులేసుకుంటూ దొడ్డి వైపుగా వెళుతోంది. శాస్త్రివైపు మధ్య మధ్యలో వెనక్కి తిరిగి చూసుకొంటూనే ఉంది శ్యామల. శాస్త్రి బిత్తరపోయి, ఆమె వెనకాలే పెద్ద పెద్ద అంగలు వేసు కుంటూ అనుసరించాడు. శ్రీమతి ఆత్మ హత్యా ప్రయత్నాన్ని ఆపడానికి.

2

అర్ధరాత్రి. పన్రెండు గంటలు కావస్తోంది. ఆ వీధంతా సద్దుమణిగి నిద్ర పోతోంది. ఒక యింటిలో బెడ్‌లైట్ వెలుతురు మాత్రం సన్నగా కనబడుతోంది. ఒక మంచంమీద రెండు శరీరాలు ఒక దానిలో ఒకటి ఏకమై పోతున్నాయి.

"నీవు రాత్రిళ్ళు చాలా 'నీట్'గ వుంటావ్. నిన్ను వదలి నేను ఒక్క క్షణం బ్రతకలేను"

"మీరు లేకుండ, నేనూ ఒక్కక్షణం బ్రతకలేను వచ్చే జన్మలోకూడ మనల్ని భార్యాభర్తలుగా పుట్టించమని ఆ భగవం తుణ్ణి కోరుకుంటున్నానండి"

"శ్యామలా!" మృదువుగా ముగ్గయి పిలిచాడు శాస్త్రి

"ఊఁ!" మత్తుగా అంది

"ఒక్కటడుగుతాను చెపుతావా?"

"అడగండి" గోముగా, అతని వక్షం మీద చెయివేస్తు అంది

"నీకు రాత్రంటే ఇష్టమా? లేక పగలంటేనా?"




## మీకు తెలుసా ?

★ 1954 జూలై 30 వ తేదీ బొంబాయి లిబర్టీ సినిమాలో రాజకపూర్ బూట్‌పాలిష్ చిత్రం రజతోత్సవం జరుపుకుంది అపుడు దానికి ముఖ్య అతిథిగా ప్రస్తుత ప్రధాని శ్రీ మొరార్జీ దేశాయి హాజరైనారు అప్పుడాయన బొంబాయి ముఖ్యమంత్రి !

★ భారతదేశంలోని పలుగురు ప్రముఖ నటులు కలిసి ఒక హిందీ చిత్రంలో మొదటిసారి నటిస్తున్నారు. తమిళనటుడు శివాజి గణేషన్, బెంగాలి నటుడు ఉత్తమకుమార్, హిందీనటులు అమితాబ్ బచ్చన్, శత్రుఘ్న సిన్హా ! ఆ చిత్రం పేరు దేశ్ ప్రేమ్ !

★ తమిళంలో విడుదలైన మొదట ఫీచర్ ఫిల్మ్ ఎల్లోరుం నల్లవరే జకోస్లోవేకియా టెలివిజన్ అక్కడి తమిళ ప్రజలకోసం ప్రదర్శించింది.

★ జపాన్, చైనా దేశాలు కలిసి ఒక చిత్రాన్ని త్వరలో నిర్మిస్తున్నాయి. చైనాలోనే తియ్యబడుతున్న ఈ చిత్రం బడ్జెట్ రు. 9 కోట్లు ?

★ హిందీలో రెండు చారిత్రిక చిత్రాలు తయారవుతున్నాయి. ఒకటి బి పి ర్యాల్ఫ్‌ఎస్ నిర్మించే చాణక్య చంద్రగుప్త ! రెండు ప్రకాష్ మెహ్రా నిర్మించే సామ్రాట్ చంద్రగుప్త ! మొదటి చిత్రంలో చాణక్యుడుగా దిలీప్‌కుమార్, చంద్రగుప్తునిగా ధర్మేంద్ర నటిస్తున్నారు. రెండో చిత్రంలో ప్రాణ్ చాణక్యుడుగా, అమితాబ్ చంద్రగుప్తుడిగ, వినోద్‌ఖన్నా అలగ్జాండరుగా నటిస్తున్నారట

★ తమిళనాడులో ఎమ్ జి ఆర్ నటించిన చిత్రాలు విజయవంతంగా ప్రదర్శింపబడుతున్నాయి. ప్రతి ఎమ్ జి ఆర్ చిత్రం బానర్లపైనా, వాల్‌పోస్టర్లపైన ముఖ్యమంత్రి ఎమ్. జి. ఆర్ నటించారు ! అన్న అక్షరాలు పెద్దవిగా కనిపిస్తున్నాయి [సురేష్ కృష్ణాజీ]

## రేయి ఎంతో హాయి

"రాత్రంటేనే నాకు భలే యిష్టం. పగలు మనం ఏమి చేసుకున్నా యిట్లే మరిచిపోయి... రాత్రికి... ఇలా హాయిగా." అతనిలో కరిగిపోతూ అంది శ్యామల.

"నాకూ అంతే" హృదయానికి హత్తుకుంటూ పొంగులన్ని పుంజుకున్న వాడిలా ఒక్కసారిగా ఆమెమీద కొరిగాడు శాస్త్రి అంతే ! ఆ ఇద్దరూ గమ్మత్తుగా మాయమయిపోయి, ఒక్కటిగ ఐపోయారు

పగలల్లా విరసాలు. రాత్రికి సరసాలు రోజంతా 'హాట్, హాట్' రాత్రంతా 'స్వీట్ స్వీట్'. 'డే' అంతా అభిరుచులలో భిన్నత్వం, 'నైట్'కేమో ఎమోషన్సులో ఏకత్వం ... ఇలాంటి 'భలే దంపతుల'ని ఈ మోడరన్ వరల్డులో అనేకానేకం చూస్తున్నానులే ననుకుంటూ, ఆకాశ మార్గాన పయనిస్తున్న 'శశి', కొంటెగా చూస్తున్నాడు. ●






Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3 Editor. S. Radhakrishna



# మనోజ్ఞమైన రూపకల్పన

నీలి, ఆకుపచ్చ, గ్రే, నలుపు, బ్రౌన్ మరియు బెయిజ్ రంగులు. ఎవరూ, ఎప్పుడూ, ఎక్కడా సమర్పించని విస్తృత శ్రేణి రంగులో!
కాటన్ బట్టలలో పాప్లిన్స్, కేంబ్రిక్స్, సాటిన్స్, డ్రిల్స్, గేబర్డిన్స్...ఇంకా పోలియెస్టర్ మిశ్రిత సూటింగులు మరియు షర్టింగులు.



# మధురా బట్టలు

తయారుచేయువారు :

# మధురా కోట్స్

డీలర్లు :

మధురా సౌత్ ఇండియా కార్పొరేషన్ (ప్రై.) లిమిటెడ్, 156, వస్త్రలత, విజయవాడ 520 001. మధురా సౌత్ ఇండియా కార్పొరేషన్ (ప్రై.) లిమిటెడ్, 3-4-191, బళ్ళారి బిల్డింగ్, 1వ ఫ్లోర్, హోల్‌సేల్ క్లాత్ మార్కెట్, సికింద్రాబాద్ 500 003. శ్రీ లక్ష్మి టెక్స్‌టైల్స్, బెసెంట్ రోడ్, గవర్నర్‌పేట, విజయవాడ 520 002.